# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ చేయనంతగా శాస్త్ర పరిశోధనం వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి ఋజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పరమెంట్ లాంటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక దబ్బా నెలల తరబడి వస్తుంది...







...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




| | | | |
|---|---|---|---|
| భారతచరిత్ర - 79 | ... 2 | హిందువుల పద్ధతులు | .... 30 |
| దుర్మార్గుడిత్యాగం | .... 5 | శనిప్రభావం ... | ... 33 |
| శిథిలాలయం - 4 | ... 9 | తల్లిప్రేమ ... | ... 40 |
| సరిఅయినశిష్యుడు | ... 17 | రాజుకుతగ్గ మంత్రి | ... 45 |
| మోసానికి మోసం | ... 23 | కృష్ణావతారం | .... 49 |
| అసలువిషయం | ... 27 | అరణ్యపురాణం | ... 57 |


ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




విడి ప్రతి
75 పైసలు

సంవత్సర చందా
రూ. 9/-

# ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి




# ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠము
వదల పెట్టుట కష్టము!

* గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కు పెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశంలేదు.
* 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6×6సెం. మీ) ఫోటోలు తీయవచ్చు.
* ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు, యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.

అగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.



దేశవ్యాప్తంగా డిస్ట్రిబ్యూటర్లు :
ఆగ్ఫా–గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు



కళ కళ లాడే ప్రింట్లకు,
ఎన్‌లార్జ్‌మెంట్లకు అగ్ఫా ఫోటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

CNAG-103 203 TL

అది యేటి ఇల్లు బిడ్డపాపలేని ఇల్లు
అది యేటి పాప ఆటపాట లేని పాప
అది యేటి ఆట ప్యారీస్ మిఠాయిలేని ఆట

ఊమ్....ప్యారీ మిఠాయిలు ఎంతైనా అనివార్యమైనవి. ఎంతో రుచికరంగా పుష్టికరంగా వుంటాయి. పిల్లలతోపాటు మీరూ పంచుకోండి-అప్పుడు తెలుస్తుంది. జీవితం ఎంత విలాసంగా వుంటుందో

క్రొత్తరకాలు రుచి చూచారా?
ఆరంజి రోల్స్ - బ్లాక్ కరన్ట్స్ -
పైన్ఆపిల్ టాఫీ - క్రీమీరోల్స్




ప్యారీస్ - విశిష్టకరమైన
మిఠాయిలు
తయారుచేయువారు

ప్యారీస్ కన్‌పెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS-4415

తప్పక చూడండి!

విచిత్రమైన తెలుగు కుటుంబాన్ని
అందమైన బొమ్మలాగా అద్దంలో
చూపిన సొంపైన తెలుగు చిత్రం!









DVS PRODUCTIONS డి.వి.యస్. ప్రొడక్షన్స్

# తిక్కశంకరయ్య



దర్శకత్వం డి.యోగానంద్ నిర్మాత డి.వి.యస్.రాజు

రచన డి.వి.నరసరాజు • పాటలు సి.నారాయణరెడ్డి · కొసరాజు • సంగీతం టి.వి.రాజు

కెమెరా జి.కె.రాము • ఆర్టు తోట • నృత్యం వెంపటి · చిన్ని, సంపత్

ఆంధ్ర రిలీజ్ విజయ • ల్యాబ్: ఉషా • పంపిణీ సదరన్ మూవీస్

VIJAYA



# చందమామ

నంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ సంచికలో "సరిఅయిన శిష్యుడు" [బేతాళకథ] పంపినవారు పి.వి.ఆర్. శివకుమార్. తాత్వికదృష్టి ఆలోచనలో ఉన్నంతమాత్రాన లాభంలేదనీ, అది ఆచరణలో ఉండాలనీ ఈ కథలోని నీతి.

మూఢవిశ్వాసాలను సరిదిద్దటం చాలా కష్టం, ముఖ్యంగా పరిస్థితులు ఆ విశ్వాసాలను బలపరిచేవిగా ఉన్నప్పుడు వాటిని తొలగించటం అసంభవమే. ఈ నీతి మనకు "శనిప్రభావం" అన్న కథలో కనిపిస్తుంది.

---

సంపుటి 43 ఏప్రిల్ '68 సంచిక 4



# భారత చరిత్ర




ఇంగ్లీషువారికీ, మైసూరు సుల్తానుకూ మొదటిసారి యుద్ధం జరిగినప్పుడు నిజాము తాత్కాలికంగా బ్రిటిషువారిని విడిచిపెట్టినప్పటికీ, తిరిగి **1768** ఫిబ్రవరి **23**న మచిలీపట్నం వద్ద ఇంగ్లీషు వారితో మరొక శాంతి ఒడంబడిక చేసుకున్నాడు. ఈ ఒడంబడిక ప్రకారం నిజాము ఉత్తర సర్కారు జిల్లాలను ఇంగ్లీషు వారికి ఇచ్చేటట్టూ, అందుకుగాను ఇంగ్లీషు కంపెనీ నిజాముకు ఏటా **9** లక్షల రూపాయలు చెల్లించేటట్టూ ఏర్పాటయింది. దరిమిలా ఇంగ్లీషువారు గుంటూరు రాజ్యాన్ని నిజాము తమ్ముడైన బసాలత్ జంగ్‌కు యావజ్జీవ భుక్తంగా ఇచ్చేసి, నిజాముకు చెల్లించే మొత్తాన్ని **7** లక్షలకు తగ్గించారు.

నిజాము తన సేనలోకి ఫ్రెంచి సిపాయీలను చేర్చుకుని **1768** ఒడంబడికను ఉల్లంఘించాడన్న నెపం మీద **1779** లో మద్రాసు గవర్నరుగా ఉండిన రంబోల్డ్ అనే అవివేకి గుంటూరును బసాలత్ జంగ్ నుంచి పుచ్చుకుని, నిజాముకు డబ్బు చెల్లించటం మానేశాడు. అయితే ఈ చర్యను గవర్నరు జనరలైన వారన్ హేస్టింగ్స్ నిరసించాడు. అయినప్పటికీ నిజాము ఇంగ్లీషువారికి వ్యతిరేకిగా పరిణమించాడు. అందుకు బలమైన కారణం మరొకటి ఏమిటంటే, చాలా క్లిష్టమైన పరిస్థితిలో ఇంగ్లీషువారు రఘోబాతో సఖ్యం చేసి ఉండటం. ఈ కోపంతో, ఇంగ్లీషువారికి విరుద్ధంగా హైదరుతోనూ, మహారాష్ట్రులతోనూ సఖ్యం చేసుకున్న నిజామును హేస్టింగ్స్ చీలదీశాడు. అందుకై అతను గుంటూరును బసాలత్ జంగ్‌కు తిరిగి ఇచ్చేశాడు.

**1782**లో బసాలత్ జంగ్ చనిపోయాడు. గుంటూరు తమకు తిరిగి ఇచ్చెయ్యమని ఇంగ్లీషువారు నిజామును అడిగారు.

79. ఇంగ్లీషుకంపెనీ అక్రమాలు



గుంటూరు నిజాముకూ, ఇంగ్లీషువారికీ కూడా అవసరమే. గుంటూరు లేకపోతే నిజాముకు సముద్రతీరం అందుబాటులో ఉండదు. ఇంగ్లీషువారికి ఉత్తరానా, దక్షిణానా గల ప్రాంతాలను కలిపేది గుంటూరే. కొంత సంకోచించిన మీదట నిజాము గుంటూరును ఇంగ్లీషువారి కివ్వటానికి ఒప్పుకుని, టిప్పూ తననుండి కాజేసిన కొన్ని మండలాలను తిరిగి రాబట్టుకోవటానికి ఇంగ్లీషు వారి సహాయం కోరాడు.



ఇంగ్లీషు గవర్నరు జనరల్ (కార్న్‌వాలిస్) ఇరుకునపడ్డాడు. ఎందుకంటే ఆ మండలాల పైన మైసూరు వారికి గల అధికారాన్ని ఇంగ్లీషువారు అప్పటికే రెండు ఒడంబడికలలో ఆమోదించి ఉన్నారు. అయినప్పటికీ, మైసూరుతో మరొక యుద్ధం జరిగితే సహాయకులు అవసరమవుతారు గనక గవర్నరు జనరలు నిజాముకు సైనిక సహాయం చెయ్యటానికి సమ్మతించాడు. మూడవ మైసూరు యుద్ధంలో నిజాము బలాలు ఇంగ్లీషువారి పక్షాన పోరాడాయి.

* * *

రుహేల్‌ఖండ్ అనే సారవంతమైన ప్రాంతం ఔధ్‌కు వాయువ్యంగా హిమాలయాల వరకు విస్తరించి ఉండేది. జనాభా 60 లక్షలు. దానిని పాలించే రుహేలా నాయకుల సమాఖ్యకు అధిపతి హాఫిజ్ రహ్మత్‌ఖాన్. ఔధ్ నవాబుకు రుహేల్‌ఖండ్‌ను కాజెయ్యాలని ఉండేది. అయితే ఉభయులకూ మహారాష్ట్రుల భయం ఉండేది. అందుచేత రుహేలాలు ఔధ్‌నవాబైన షుజాఉద్దౌలాతో ఒక ఒప్పందం చేసుకున్నారు: మహారాష్ట్రులు రుహేల్‌ఖండ్ మీదికి దాడివస్తే ఔధ్‌నవాబు వారిని పారదోలాలి; అందు నిమిత్తం రుహేలాలు 40 లక్షల రూపాయలు ఇచ్చుకోవాలి.

ఈ ఒప్పందం జరిగిన మరుసటి ఏడే (1773)లో మహారాష్ట్రులు రుహేల్‌ఖండ్

పై దాడి చేశారు. బ్రిటిషు సైనికులూ, ఔథ్ సైనికులూ వారిని తరిమికొట్టారు. అయితే షుజాఉద్దౌలాకు రుహేలాలు 40 లక్షలు ఇవ్వలేదు. ఆ సాకుతో షుజా ఉద్దౌలా బ్రిటిషు బలాలను తన బలాలకు తోడుగా పెట్టుకుని రుహేల్‌ఖండ్ పై యుద్ధం చేసి 1774 ఏప్రిల్‌లో విజయం సాధించాడు.

ఈ విషయంలో గవర్నరు జనరల్ వారన్‌హేస్టింగ్స్ పాత్ర బ్రిటిషు పార్లమెంటులో గర్హించబడింది. వారాణసి రాజైన చైత్‌సింగ్ విషయంలో హేస్టింగ్స్ ప్రవర్తన ఇంకా నీచమైనది. చైత్‌సింగ్ 1775 జులై నెలలో ఇంగ్లీషు కంపెనీతో ఒక ఒప్పందం చేసుకుని, తాను కంపెనీ పెత్తనం కింద ఉండేటట్టూ, అందుకుగాను తాను కంపెనీకి ఏటా 22న్నర లక్షల రూపాయలు ఇచ్చేటట్టూ అంగీకరించాడు.

1778 లో ఇగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ యుద్ధం సాగినప్పుడు హేస్టింగ్స్ చైత్‌సింగ్‌ను మరో 5 లక్షలు అదనంగా ఇవ్వమని అడిగాడు. చైత్‌సింగ్ ఇచ్చాడు. కాని వారన్‌హేస్టింగ్స్ మళ్ళీ మళ్ళీ అదనపు ధనం అడుగుతూ వచ్చాడు, చైత్‌సింగ్ ఇస్తూ వచ్చాడు. తరవాత హేస్టింగ్స్ కోరిన ప్రకారం చైత్‌సింగ్ అశ్వికదళాలను ఇవ్వలేకపోయాడు. అది సాకుగా పెట్టుకుని, హేస్టింగ్స్ స్వయంగా వారాణసి వెళ్ళి, చైత్‌సింగ్‌ను అరెస్టు చేశాడు.

ఇది చూసి చైత్‌సింగ్ సిపాయిలు ఆగ్రహావేశులై, అకస్మాత్తుగా తిరగబడి, అనేక మంది ఇంగ్లీషు సైనికులనూ, ముగ్గురు సైనికాధికారులనూ వధ చేశారు. ఇలా జరుగుతుందని చైత్‌సింగ్‌కు తెలియదు. నిర్దోషి అయినప్పటికీ చైత్‌సింగ్ పదవీ భ్రష్టుడై, గ్వాలియర్‌లో తలదాచుకున్నాడు. ఏటా కంపెనీకి 40 లక్షలు కట్టే షరతు మీద, చైత్‌సింగ్ పదవిని అతని తమ్ముడి కొడుకిచ్చారు.





# దుర్మార్గుడి త్యాగం

పూర్వం ఒక చిన్న నగరాని కొక రాజుండే వాడు. ఆ రాజుకు ఒక్కడే కొడుకు. అందు చేత రాజు తన కొడుకును కాస్త గారాబంగా పెంచాడు. రాజుకొడుకుక్కు ఇద్దరు స్నేహితు లుండేవారు; ఒకడు వర్తకుడి కొడుకూ, రెండోవాడు పురోహితుడి కొడుకూనూ. ఈ ముగ్గురూ ఒక గురువు వద్దనే చదువు కున్నారు. కాని ముగ్గురికీ చదువు ఏమంత అంటలేదు. వాళ్ళు అస్తమానమూ అల్లరి చిల్లరగా తిరుగుతూ తమ తండ్రులను అప్రతిష్ఠపాలు చెయ్యసాగారు.

రాజు ఒకనాడు తన కొడుకును పిలిచి గట్టిగా మందలించాడు. రాజుకొడుకు తన స్నేహితులతో ఈ సంగతి చెప్పాడు.

"ఏం చేస్తాం? మా తండ్రులు మమ్మల్ని కూడా నానా చివాట్లూ పెడుతూనే ఉన్నారు," అన్నారు రాజకుమారుడి మిత్రులిద్దరూ.

"నే నీ ఊళ్ళో ఒక్క క్షణం కూడా ఉండను. రోజూ మా తండ్రి చేత ఇలా మాటలు పడటం కన్న ఎక్కడికైనా వెళ్ళి స్వేచ్ఛగా బతకటం మేలు," అన్నాడు రాజుకొడుకు.

"నువు వెళ్ళేటట్టయితే నీ వెంట మేమూ వస్తాం," అన్నారు అతని మిత్రులు.

వాళ్ళు దేశ సంచారం మీద బయలు దేరటం ఖాయమంది.

"తిరగటానికైనా కొంత డబ్బుండాలి. డబ్బు లేకపోతే చాలా కష్టాలు పడతాం," అన్నాడు వర్తకుడి కొడుకు.

"డబ్బు మూటలు మొయ్యలేం. తేలి కగా తీసుకుపోవాలంటే రత్నాలు మేలైనవి. నేను మన ముగ్గురికీ మూడు రత్నాలు తెస్తాను. వాటిని అమ్ముకుని ఎంత కాలమైనా హాయిగా ఖర్చు చేసుకోవచ్చు," అన్నాడు రాజుకొడుకు.

గార్లపాటి ముత్యాలరావు



రాజుకొడుకు మూడు రత్నాలు తీసుకు వచ్చి, ముందుగా అనుకున్న స్థలంలో తన స్నేహితులను కలుసుకున్నాడు. ముగ్గురూ ప్రయాణం సాగించారు.

వాళ్ళు పోయి పోయి ఒక అరణ్యాన్ని చేరుకున్నారు.

"ఈ అరణ్యంలో దొంగ లుంటారు. వాళ్ళు మనని సులువుగా దోచుకోగలరు. ఏమిటి ఉపాయం?" అని వర్తకుడి కొడుకు అన్నాడు.

"మనం తలా ఒక రత్నమూ మింగుదాం. ఈ అడవి దాటాక మనకు దొంగల భయం ఉండదు," అన్నాడు పురోహితుడి కొడుకు.

ముగ్గురూ, సరే అనుకుని మూడు రత్నాలనూ మింగారు.

వీళ్ళ సంభాషణ అంతా ఒక దొంగ చెట్లచాటు నుంచి విన్నాడు. వాళ్ళ దగ్గిర ఉన్న రత్నాలను ఎలాగైనా కాజెయ్యాలని వాడికి బుద్ధి పుట్టింది. వాళ్ళను ముందు వెళ్ళనిచ్చి, దొంగ మరో దారిన వేగంగా వెళ్ళి, వాళ్ళకు ఎదురొచ్చి, "బాబుల్లారా, నేను చాలా పేదవాణ్ణి. మిమ్మల్ని చూడబోతే గొప్పవాళ్ళ లాగున్నారు. నన్ను కూడా మీ వెంట రానివ్వండి. మీకు కావలిసిన సేవ లన్నీ చేస్తాను. నాకు మీతో బాటు ఇంత తిండి పెడితే చాలు," అన్నాడు.

వాళ్ళు ముగ్గురూ చిన్నవాళ్ళు. దారి చూడబోతే అరణ్యమార్గం. ఈ మనిషి బాగా బలంగా ఉన్నాడు. అటువంటివాడు నౌకరుగానూ, రక్షకుడుగానూ ఉండటం మంచి దనుకుని ఆ కుర్రవాళ్ళు వాణ్ణి తమతో బాటు రానిచ్చారు.

ఆ సాయంకాలం చీకటి పడే వేళకు వాళ్ళు ఒక కోయగూడెం సమీపించారు. వాళ్ళు నడిచే దారి కోయదొర ఉండే గుడిసె ముందుగానే పోతున్నది. ఆ గుడిసె వెలపల ఒక స్థంభానికి కట్టి ఉన్న పంజరంలో ఒక రాకసిచిలక ఉన్నది.



అ చిలక దారే పొయ్యే నలుగుర్నీ చూడ గానే కర్ణకఠోరంగా అరిచింది. దారే పొయ్యే వాళ్ళ దగ్గిర ధనం ఉంటేనే అది అలా అరుస్తుంది, లేకపోతే అది అరవదు. ఆ సంగతి కోయదొరకు తెలుసు. అందుచేత చిలక అరుపు వింటూనే కోయదొర గుడిసెలో నుంచి బయటికి వచ్చి, దారిన పోతున్న ముగ్గురు కుర్రవాళ్ళనూ, ఒక పెద్దవాణ్ణీ చూశాడు. చూసి, "ఆగండి! మీ దగ్గిర ఉన్న సొత్తంతా అక్కడ పెట్టి మరీ కద లండి," అన్నాడు.

కుర్రవాళ్ళ వెంట ఉన్న దొంగ, "మా దగ్గిర ఏమీ లేదు. కావలిస్తే పరీక్ష చేసుకో," అన్నాడు.

కోయదొర ముగ్గురినీ శ్రద్ధగా పరీకించి వాళ్ళ దగ్గిర ఏమీ లేదని తెలుసుకుని, "సరే, వెళ్ళండి," అన్నాడు.

వాళ్ళు కదలగానే చిలక తన సొమ్మంతా పోయినట్టు మరింత కర్కశంగా అరిచింది. వాళ్ళ దగ్గిర ఎక్కడో ధనం ఉన్నదని కోయదొరకు నమ్మకం కలిగింది. అతను తన మనుషులను పిలిచి, "వీళ్ళను మన చుట్టు గుడిసెలో పెట్టి బంధించి ఉంచండి. నేను రాత్రికి వచ్చి వీళ్ళ సంగతి తేల్చు తాను," అన్నాడు.



కోయవాళ్ళు ఆ నలుగుర్నీ తీసుకుపోయి ఒక గుండ్రని గుడిసెలో పెట్టి తలుపు మూశారు. ఆ చుట్టు గుడిసెకు ఒకే ఒక ద్వారం ఉన్నది.

చీకటిపడగానే ఆ ద్వారం వెలపల ఇద్దరు ముగ్గురు కోయవాళ్ళు ఈటెలు తీసుకుని కాపలా ఉన్నారు.

అర్ధరాత్రి కావస్తుండగా కోయదొర వచ్చాడు. వాడు తన ఖైదీలతో, "మీరు ధనం దాచిన మాట నిజం. అది మీ ఒంటి మీద లేదు. కనక ఎక్కడుందో మర్యాదగా చెప్పండి. చెప్పకపోతే మీ డొక్కలు చీల్చి మరీ చూస్తాను," అన్నాడు.



దొంగవాడు ఆలోచించాడు. కోయదొర అన్నంతపనీ చేస్తాడు. తన కడుపులో తప్ప మిగిలిన ముగ్గురి కడుపుల్లోనూ మణు లున్నాయి. కోయదొర ముందుగా వాళ్ళలో ఎవరి పొట్ట చీల్చినా, అందరి పొట్టలూ చీల్చి తీరుతాడు. ఎందుకంటే ఆ ముగ్గురి పొట్టల లోనూ మణులు దొరికాక, తన పొట్టలో కూడా మణి దొరుకుతుందనే వాడు అను కుంటాడు. నలుగురూ చావటం నిశ్చయం. అట్లా కాకుండా కోయదొర ముందుగా తన పొట్టను చీల్చేటట్టు చేసిన పక్షంలో ఆ ముగ్గురు కుర్రాళ్ళూ ప్రాణాలతో బయట పడే అవకాశం ఉంది. ఎందుకంటే తన పొట్టలో ఏమీ ఉండదు గనక వాళ్ళ పొట్ట లలో కూడా ఏమీ ఉండదనే కోయదొర అనుకోవచ్చు.

ఈ విధంగా ఆలోచించి దొంగ ధైర్యంగా కోయదొరను ధిక్కరిస్తూ, "మా దగ్గిర ఏమీ లేదంటే నమ్మవేం? నీ కేమన్నా మతి మతిలో లేదా? డొక్క చీల్చి చూస్తావా? చూసుకో!" అన్నాడు.

కోయదొరకు ఆగ్రహం వచ్చింది. వాడు బొడ్డు నుంచి కత్తిలాగి దొంగ డొక్కను ఒక్క దెబ్బతో చీల్చాడు. దొంగ ప్రాణం పోయి పడిపోయాడు. కాని కోయదొర ఎంత వెతికినా వాడి డొక్కలో పడ్లగింజంత బంగారం కూడా లేదు.

నిష్కారణంగా నిండు ప్రాణాన్ని నిలువునా తీసినందుకు కోయదొర పశ్చాత్తాప పడ్డాడు. తనను మోసం చేసిన చిలకను తిట్టుకుంటూ వాడు ముగ్గురు కుర్రాళ్ళనూ విడిచిపుచ్చాడు.

ఈ అనుభవంతో వాళ్ళకు దేశసంచారం మీద విరక్తిపుట్టింది. వాళ్ళు వచ్చిన దారినే తమ నగరానికి తిరిగి వెళ్ళి, తండ్రులు చెప్పినట్టు వింటూ, బుద్ధిగా విద్యాభ్యాసం చేసి, పెద్దవాళ్ళయాక అందరిచేతా యోగ్యులనిపించుకున్నారు.





# శిథిలాలయం

## 4

[శిథిలాలయ పూజారినని చెప్పిన వికృతాకారుడి కోసం శిఖిముఖీ, విక్రమకేసరీ చెరొక మార్గాన వెళ్లారు. శిఖిముఖి మామిడితోపులో అడుగు పెట్టేసరికి, అతడి కాలి కొక తాడు బిగుసుకుపోయి, చెట్టుకొమ్మకు వేలాడదీసింది. పూజారిని శిఖిముఖి ఈటెతో పొడవ బోయాడు. పూజారి అనుచరులు అరుస్తూ, అతణ్ణి చంపేందుకు కత్తులెత్తారు. తరవాత—]

పూజారి అనుచరులు తన పైకి కత్తు లెత్తటం చూస్తూనే శిఖిముఖి తనకు చావు తప్పదనుకున్నాడు. తను చచ్చే ముందు ఆ దుర్మార్గుల్లో ఒక్కణ్ణయినా చంపి తీరా లన్న పట్టుదలా, ఉద్రేకం అతడిలో పర వళ్ళు తీసింది. ఆ వెంటనే అతను 'జై, శబర మాతా!' అంటూ అరణ్యం ప్రతిధ్వనించేలా అరిచి, తన కాలిని బిగించి పట్టి వున్న తాడును ఈటెతో గురిగా ఒక్కపోటు పొడి చాడు. ఆ దెబ్బకు తాడు సగం నరుక్కు పోయింది, తతిమ్మా సగం అతడి బరువును మోయలేక పటీ మంటూ తెగింది. శిఖిముఖి ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా, అతడి తల బలంగా నేలను తాకటం జరిగేది. కాని, అతడు వానరంలా ఒక్క ఊపున కాళ్ళు రెంటినీ పల్టీకొట్టినట్టు గిరున భూమి మీదికి తెచ్చి, దాని తాకిడిని తట్టుకునేందుకు ఈటెను ముందుగా నేల మీద గుచ్చాడు.



పూజారి అనుచరులు అతడి లాఘవం చూసి ఆశ్చర్యపోయారు. వాళ్ళల్లో ఒకడు శిఖిముఖిని మెచ్చుకుంటూ, "శబర వెధవ బాగా సాముగరిడీలు నేర్చిన వాళ్ళా వున్నాడు. ఇలాంటివాడు మన ముఠాలో కలిసివుంటే, మనం సాధించలేం దేముంటుంది?" అన్నాడు.

"వీడు మనిషి కాదు, మర్కటం. నేలంటకుండా చెట్లకొమ్మల మీద గెంతుతూ వింధ్య పర్వతాలనే చేరగలడు. చూస్తారేం, పొడవండి!" అన్నాడు మరొక అనుచరుడు.

ఈ విధంగా ఒకటి రెండు క్షణాలు పూజారి అనుచరులు నిర్విణ్ణులైపోయి, తన మీద కత్తులు ప్రయోగించటానికి బదులు, వాచాలత చూపటం శిఖిముఖికి మంచి అవకాశం కలిగించింది. అతడు ఒడుపుగా ఒక విరోధి మోకాలి మీద బలంగా తన్ని, వాడు అరుస్తూ వెనక్కు పడబోయేంతలో మెరుపులా వాడి వీపు కింది నుంచి చరున జారి తన చుట్టూ వున్న శత్రువలయాన్ని ఛేదించి బయట పడగలిగాడు.

పూజారి అనుచరులు శిఖిముఖి పారిపోయే యత్నం చేస్తున్నాడని తెలిసి కూడా, కత్తులు వుపయోగించ లేకపోయారు. కత్తి పొరబాటున తమ వాళ్ళకే తగులుతుందేమో అన్న భయం వాళ్ళక్కలిగింది. శిఖిముఖి శత్రువునే తన కవచంగా వాడుకో గలిగాడు, కాని, ఒకసారి అతడు వాళ్ళ నుంచి కొంచెం దూరం పరిగెత్తగానే పూజారి అనుచరులంతా ఒక్కసారిగా, "చంపండి, పారిపోనీకండి," అని అరుస్తూ అతడి వెంట బడి చుట్టుముట్టేందుకు ప్రయత్నం చేశారు.

ఆ సమయంలో దూరం నుంచి ఈల వినబడింది. అది శిథిలాలయ పూజారి తన బంట్ల కిచ్చే హెచ్చరిక. ఆ హెచ్చరిక వింటూనే అతడి అనుచరుల్లో ఒకడు, "పూజారిదొర పిలుస్తున్నాడు, వినపడలేదా, పరిగెత్తండి," అన్నాడు.

"ఈ పారిపోతున్న శబరపిశాచంగాడి మాటేవిఁటి? వీణ్ణి పట్టుకు పోవద్దా పూజారి దొర దగ్గిరికి?" అని ప్రశ్నించాడొకడు.

ఆ ప్రశ్నకు మొదట మాట్లాడినవాడు జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు పెద్దగా మొరగటం వినబడింది. ఆ వెంటనే శబరుల కేకలూ, విక్రమకేసరి, "శిఖిముఖీ! శిఖిముఖీ!" అని పిలుస్తూ అటుగా పరిగెత్తుకు రావటం దొంగల కంటబడింది.

పూజారి యీసారి మరింత బిగ్గరగా ఈల వేశాడు. వాడి అనుచరులంతా ఒకణ్ణొకడు ఎలాంటి హెచ్చరికా చేసుకోకుండానే, గాయపడిన దొంగలను భుజాన వేసుకుని గిర్రున వెనుదిరిగి, అరణ్యం కేసి పరిగెత్తసాగారు.

శిఖిముఖి ఎర్రగండును గట్టిగా కేక వేశాడు. ఆ కేక వింటూనే కుక్క అతడున్న చోటుకు పరిగెత్తు కొచ్చింది. కొంచెం వెనగ్గా విక్రమకేసరీ, నలుగురైదుగురు శబరులూ అక్కడి కొచ్చి చేరారు.

"నువ్వేదో ప్రమాదంలో చిక్కుకున్నావని, నేను భయపడ్డాను, శిఖిముఖీ!" అన్నాడు విక్రమకేసరి.

"చాలా పెద్ద ప్రమాదంలోనే చిక్కుకున్నాను. అదృష్టం కొద్దీ బయటపడ్డాను. ఆ దుర్మార్గు లీప్రాంతాన మాటుపెట్టి నన్ను




తల కిందులుగా వేలాడ దీసి చంపాలని చూశారు...అదంతా తరవాత మాట్లాడుకో వచ్చు. ముందు ఆ పూజారి బంట్లు దాగి వుండే స్తలం ఏదో మనం తెలుసుకోవాలి. ఒకళ్ళిద్దరం అయినా, వాళ్ళను వెన్నంటి పోగలిగితే, సూర్యోదయం కాగానే ఆ ముఠానంతా అడవిజంతువుల్ని వేటాడినట్టు వేటాడవచ్చు," అన్నాడు శిఖిముఖి.

"వాళ్ళు అరణ్యంలో ఎక్కడ దాగి వుండేదీ కనుక్కోవటానికి మన ఇద్దరం చాలు. ఎర్రగండు పశికట్టి మనకు దారి చూపగలదు. తెల్లవారగానే పల్లెవాసులంతా మనకు సహాయం వస్తారు," అంటూ విక్రమ



కేసరి తన వెంటవున్న శబరుల కేసి తిరిగి, "ఇక మీరు పల్లెకు పొండి. మరొకసారి పూజారి అనుచరులు పల్లెకు నిప్పు పెట్ట కుండా చూసుకోండి. మా ఇద్దర్లో ఎవరో ఒకరు ఆ క్రూరులు అరణ్యంలో ఎక్కడ దాగి వున్నారో చూసి, పల్లెకు వార్త తెస్తాం," అని చెప్పాడు.

శబరులు వెళ్ళిపోయారు. ఆ తరవాత శిఖిముఖీ, విక్రమకేసరీ అరణ్యం కేసి బయలుదేరారు. ముందు ఎర్రగండు నేలను పశిగటుతూ నడవసాగింది. అది దొంగలు పోయిన మార్గాన్ని సరిగానే గుర్తించిందన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. క్రమంగా ఎర్రగండు వాళ్ళను అరణ్యంలోని ఒకానొక కొండ ప్రాంతానికి తీసుకుపోయి, అక్కడ ఒక మహా వృక్షం కింద నిలబడి కొంచెం సేపు భూమిని మూచూసి, చెట్టు చుట్టూ గిర్రుగిర్రున తిరుగుతూ, తల ఎత్తి పైకి చూడసాగింది.

విక్రమకేసరికి కుక్క ప్రవర్తన వింతగా కనబడింది. అతడేమో మాట్లాడబోయేంతలో శిఖిముఖి అతణ్ణి వారించి, తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి పరీక్షగా చూశాడు. గుబురు కొమ్మల్లో అతడికో మానవాకారం కన బడింది. బాగా పరీకించి చూసిన మీదట శిఖిముఖికి, వాడు పూజారి అనుచరుడని తెలిసిపోయింది. వాడు, చెట్టు కొమ్మ నొక దాన్ని రెండు చేతులతో గట్టిగా కావిలించు కుని, కొమ్మ మీద బోర్లాపడుకుని నిద్ర పోతున్నాడు. ఒర నుంచి కత్తి కిందికి వేళ్ళాడుతున్నది.

శిఖిముఖి వాణ్ణి విక్రమకేసరికి చూపుతూ, చిన్న గొంతుతో, "కేసరీ, వాడు శిథిలాలయ పూజారి కాపలావాడన్నమాట. చెట్టు మీద దాగి, యీ ప్రాంతాలకు వచ్చేవాళ్ళను కనిపెట్టివుండి, కబురందించమని ఆ వికృతా కారుడు వీణ్ణి యిక్కడ కాపలా పెట్టి వుంటాడు. కాని, యీ వెధవ రాత్రంతా

అరణ్యంలో చెడ తిరిగి సూర్యోదయం వేళకు హాయిగా చెట్లకొమ్మల్లో నిద్ర పోతున్నాడు," అన్నాడు.

"వీణ్ణి మనం ప్రాణాలతో పట్టుకుని పూజారిని గురించిన రహస్యాలు లాగాలి," అన్నాడు విక్రమ కేసరి.

"ప్రాణాలతో పట్టుకోవటమే కాదు, నిద్ర మేల్కొని అరవకుండా చూడాలి. వీడు అరిచాడో పూజారికి మనం యీ ప్రాంతాల కొచ్చినట్టు తెలిసిపోతుంది. అదుగో సూర్యోదయం కూడా అవుతున్నది. నువ్వు చెట్టు కిందనే వుండు. నేను నిశ్శబ్దంగా చెట్టెక్కి వాణ్ణి కిందికి లాక్కొస్తాను," అని చెప్పి శిఖిముఖి దాపులనున్న చెట్ల మీది కొన్ని అడవి తీగలను తెంచి, అరచేతి వెడల్పు, ఒక గజం పొడవూ వుండేట్టుగా వాటిని అల్లి, మెల్లిగా చెట్టు మీదికి పాకిపోయి, పూజారి అనుచరుడి మెడను గట్టిగా ఒక చేత్తో పట్టు కుంటూనే, రెండో చేత్తో యీటెను అతడి కళ్ళ ముందు ఆడించాడు.

పూజారి అనుచరుడు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఎదురుగా వాడికి ఉదయసూర్య కిరణాల్లో తళతళా మెరుస్తున్న ఈటె అలుగు కనిపించింది. వాడు భయ కంపితుడై అరవబోయేంతలో, శిఖిముఖి



చేతి పట్టును మెడమీంచి గొంతు మీదికి మార్చి, "నోరెత్తావో, ఈటె గుండెల్లో దించు తాను. కొద్ది రోజులపాటైనా బతక దలిస్తే, కిక్కురు మనకుండా నాతోపాటు చెట్టు దిగు," అని చెప్పి, వాడి ఒర నుంచి కత్తి లాక్కుని చెట్టు దిగాడు. పూజారి అను చరుడు గడగడ వణికిపోతూ అతడి వెనకగా చెట్టు దిగి వచ్చాడు.

శిఖిముఖి, పూజారి అనుచరుణ్ణి చెట్టు బోదెకు అనుకు కూర్చోమని ఆజ్ఞాపించి, "నువ్వా ప్రేతాకారంగాడి బంటువేగదా? నిజం చెప్పకపోయావో నిన్ను ప్రాణాలతోనే ఎర్రగండుకు ఆహారంగా వేస్తాను. వాడి





"పూజారి పెద్ద అబద్ధాలకోరు. వాడి బంటు మరొక విధంగా ఎందుకుంటాడు? ఎర్రగండును ఉసికొలుపు, శిఖిముఖీ," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఊఁ అనగానే ఎర్రగండు పూజారి అనుచరుడి మీదికి ఎగిరి దూకి, వాడి గొంతు పట్టుకోబోయినదల్లా ఆగి, తల తిప్పి యజమాని కేసి చూసింది. "అహాఁ, యిది కుక్క కాదు, ఇంగితం ఎరిగిన మనిషి," అన్నాడు విక్రమకేసరి.

పూజారి అనుచరుడు ప్రాణభీతితో అరవబోయే సరికి శిఖిముఖి అతడి మీదికి ఈటె గురి చేసి, "అరవకు. ఇప్పటికైనా అబద్ధాలాడక, నిజం చెప్పు. ఎర్రగండు నిన్నేమీ చేయదు," అన్నాడు.

"నేను నిజమే చెప్పాను, రక్షించు దొరా!" అంటూ పూజారి అనుచరుడు కళ్ళ నీళ్ళు పెట్టాడు.

దొంగవాడి కళ్ళ నీళ్ళు చూడగానే విక్రమకేసరికి అతడి మీద జాలి కలిగింది. అతడు శిఖిముఖి భుజం పట్టుకుని, "శిఖీ! పాపం, వాణ్ణి చంపకు. నిజమే చెప్పాడు, తెలియటం లేదా? మనం వీడు చెప్పే ప్రాంతానికెళ్ళి చూద్దాం. పూజారి పెద్ద ముచ్చువెధవ. వాడు తనను నమ్మి సేవ

కొండ ప్రాంతాల ఏ గుహలో వుంటున్నాడు?" అని ప్రశ్నించాడు.

పూజారి అనుచరుడు ప్రాణభయంతో కంపించిపోతూ, "అయ్యా, నన్ను చంపకండి, నిజం చెపుతాను. పూజారి దొర యీ కొండ ప్రాంతాల పూట కొకచోటు మారుతూంటాడు. నిన్న సాయంకాలం ఆ దొర వున్న చోటు—ఒంగున్న రాక్షసిలా కనబడే ఆ గండశిల వెనక వున్న చీకటి గుహ. ఇప్పుడింకా అక్కడే వున్నాడో లేదో నాకు తెలీదు," అన్నాడు.

"నువ్వు నిజమే చెపుతున్నావా?" అని గద్దించి అడిగాడు శిఖిముఖి.



చేసే వాళ్ళతో అయినా మనసిచ్చి మాట్టాడతాడని నేననుకోను," అన్నాడు.

శిఖిముఖి ఎర్రగండును యివతలికి పిలిచి, దొంగతో, "ఒరే, నిన్ను కొంతసేపయినా కాళ్లూ చేతులూ కట్టి, నోరు బిగించి, ఆ పొదల్లో దాచి పోక తప్పదు. మీ యజమాని ఎక్కడున్నాడో చూసి తిరిగొచ్చేప్పుడు నీ కట్లు విప్పుతాను," అంటూ వాడి కాళ్ళూ చేతులూ కట్టి, నోటికి అడ్డంగా అడవి తీగలతో అల్లిన వల నొకదాన్ని బిగించి, మూటలా ఎత్తుకుపోయి గుబురుగా వున్న పొదల్లో పడవేశాడు.

తరవాత శిఖిముఖీ, విక్రమకేసరీ, ఎర్రగండూ దొంగ చెప్పిన కొండ ప్రాంతాని కేసి బయలుదేరారు. వాళ్ళ కా ప్రాంతాల్లో మనుషులు సంచరించిన గుర్తులు కనిపించినై. వాటిని చూస్తూ వాళ్ళు మరికొంత ముందుకు పోయేసరికి, నలుగురైదుగురు మనుషులు పక్కపక్కన నడవటానికి వీలుగా వున్న ఒక కొండదారి మీద— అంత ఎత్తున ఒక కొయ్యబొమ్మ కనిపించింది. దాని చేతుల్లో రక్తంలో తడిసి వున్న ఒక త్రిశూలం వున్నది.

విక్రమకేసరి ఆ భయంకర విగ్రహాన్ని చూసి ఆశ్చర్యపడుతూ ముందుకు నడవబోయేంతలో, శిఖిముఖి అతడి భుజం పట్టుకుని వెనక్కులాగి, "కేసరీ, ఆగు. మనం ఆ దారి వెంట పోవాలంటే, ఆ కొయ్యబొమ్మ కాళ్ళ కిందుగా నడవాలి. దాని చేతిలో రక్తం ఓడుతున్న త్రిశూలాన్ని చూశావా?" అని ప్రశ్నించాడు.

వాళ్ళిద్దరూ ఇలా మాట్టాడుతున్నంతలో ఎర్రగండు కొయ్యబొమ్మను సమీపించి, దాని కాళ్ళ కిందుగా ముందుకు పోబోయింది. అంతలో బొమ్మ జవజవ మంటూ వణికింది. దాని చేతిలో వున్న త్రిశూలం మెరుపులా నేల మీదికి జుంమ్ అంటూ దిగసాగింది. —(ఇంకా వుంది)






# సరిఅయిన శిష్యుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే పూర్వం అయోధ్యను పాలించిన ధర్మపాల మహారాజు జ్ఞాపకం వస్తున్నాడు. ఆయన కూడా చేసే చేసే రాజ్యాన్ని వదిలి కష్టాలు కొని తెచ్చుకున్నాడు. శ్రమతెలియ కుండా ఉండగలందులకు నీకు ధర్మపాలుడి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

అయోధ్యానగరాన్ని పాలించిన ధర్మపాల మహారాజుకు తాత్విక చింతన మీద ఆసక్తి హెచ్చు. ఒక వంక రాజ్యపాలన చూసుకుంటూనే ఆయన ఎన్నో వేదాంత గ్రంథాలు చదివేవాడు, ఎంతో మంది తత్వవేత్తలతో చర్చలు జరిపేవాడు. ఎంత

## బేతాళ కథలు



చదివినా, ఎంత చర్చించినా తాను తెలుసుకో వలసినది ఇంకా ఎంతో ఉన్నదని ఆయనకు అనిపించేది. తనకు సరిఅయిన గురువు లేక పోవటంచేతనే ఈ అసంతృప్తి తనను బాధి స్తున్నదని ఆయన తేల్చుకున్నాడు.

ఈ నిశ్చయానికి వచ్చాక ధర్మపాలుడు, "సరి అయిన గురువు లేడా?" అని తన రాజ్యమంతటా చాటింపు వేయించాడు. దాని అర్థమేమిటో ఎవరికీ తెలియలేదు.

కాని, నగరం వెలపల ఒక పూరిగుడి సెలో ఉండే మాలవా డొకడు చాటింపు వేసే వాణ్ణి నిలిపి, చాటింపు రాజుగారు వేయి స్తున్నట్టు తెలుసుకుని, "నువు వేయవలిసిన చాటింపు అది కాదు. 'సరి అయిన శిష్యుడే లేడు,' అని రాజుగారి భవనందాకా చాటింపు వేసుకుంటూ పో," అన్నాడు.

తాను చాటింపు వెయ్యటానికి పంపిన మనిషి సాయంకాలానికి, "సరి అయిన శిష్యుడే లేడు" అని తన భవనం ముందు కేక పెడుతూండటం విని రాజుగారు, వాణ్ణి పిలిపించి, "నిన్నిలా చాటింపు వేయమని చెప్పినదెవరు?" అని అడిగాడు.

"మహారాజా, నేను, తమరు చెప్పి నట్టుగా చాటింపు వేస్తూ మన నగరానికి దక్షిణంగా ఉండే మాలగూడానికి వెళ్ళాను. అక్కడ ఒక గుడిసెలో నుంచి ఒక మనిషి బయటికి వచ్చి, చాటింపు వేయిస్తున్నది తమరే నని తెలుసుకుని, నన్ను ఈవిధంగా చాటింపు వెయ్యమన్నాడు," అన్నాడు చాటింపుమనిషి.

రాజుగారు ఆ మాలవాడి గుడిసెకు గుర్తు లన్నీ అడిగి తెలుసుకుని, ఝాము రాత్రి గడిచాక, తనను ఎవరూ గుర్తించకుండా మారువేషం వేసుకుని, ఆ మాలవాణ్ణి వెతుక్కుంటూ నగరానికి దక్షిణంగా ఉన్న మాలగూడానికి వెళ్ళి, గుడిసె తలుపు తట్టాడు. లోపలి నుంచి మాలవాడు వచ్చి, "ఎవరది?" అని రాజును అడిగాడు.



"నేను ధర్మపాల మహారాజును. సరి అయిన శిష్యుడే లేడని చాటింపు వేయమన్నది మీరేనా?" అని రాజు అడిగాడు.

"అవును," అన్నాడు మాలవాడు.

రాజు ఆ మాలవాడి పాదాలకు ప్రణామం చేసి, "మహాత్మా, నేను మీకు శిష్యుడుగా ఉంటాను, జ్ఞానబోధ చెయ్యండి," అన్నాడు.

"ఇప్పుడు కాదు, రేపు ఉదయంరా," అంటూ మాలవాడు గుడిసెలోకి వెళ్ళాడు.

తాను రాత్రివేళ మారువేషంలో రహస్యంగా రావటం అతనికి సమ్మతం కాలేదని గ్రహించి, రాజు ఇంటికి తిరిగిపోయి, మర్నాడు తెల్లవారుఝామున లేచి, కాలకృత్యాలు తీర్చుకుని మళ్ళీ మాలవాడి గుడిసెకు వెళ్ళి, "మహాత్మా!" అని పిలిచాడు.

మాలవాడు గుడిసె నుంచి బయటికి వచ్చి, "వచ్చావా, మహారాజా? రాజ్యం ఏం చేశావు?" అని అడిగాడు.

"ఏమీ చెయ్యలేదు. రాజ్యం నా కిందే ఉన్నది," అన్నాడు రాజు. మాలవాడు మరి మాట్లాడక గుడిసెలోకి వెళ్ళిపోయాడు.

రాజు మళ్ళీ తన భవనానికి వెళ్ళి, తన మంత్రులను పిలిచి, "ఇక నుంచీ నేను రాజును కాను. మీ యిష్టం వచ్చినవాణ్ణి



రాజుగా నిర్ణయించి రాజ్యాభిషేకం జరిపించుకోండి," అని చెప్పి, మాలవాడి వద్దకు తిరిగి వచ్చి, "మహాత్మా, నేను రాజ్యత్యాగం చేసి వచ్చేశాను. ఇప్పుడు నేను రాజును కాను. అందరిలాటి మనిషినే," అని చెప్పాడు.

మాలవాడు తృప్తిపడ్డట్టు కనిపించి, "ధర్మపాలా, ఇక నుంచీ నువు నా శిష్యుడివి. నేను నీకు గురువును. నేను చెప్పినట్టు చెయ్యటమే నీ పని," అంటూ ధర్మపాలుణ్ణి వెంట పెట్టుకుని బయలుదేరాడు.

కాలక్రమాన వారు మరొక రాజ్యం చేరారు. మాలవాడు రాజవీధిలో ఒక చోట



నిలబడి, జనాన్ని పోగుచేసి, ధర్మపాలుణ్ణి పది వరహాలకు బానిసగా అమ్మ జూపాడు. ఒక వేశ్య ధర్మపాలుణ్ణి కొనటానికి ముందుకు వచ్చింది.

మాలవాడు ఆమెతో, "అమ్మా, నా యిష్టం వచ్చినప్పుడు నేను పది వరహాలిచ్చి ఈ మనిషిని తీసుకుపోతాను. అందుకు అభ్యంతరం లేకపోతేనే ఈ మనిషిని నువు కొనుక్కో," అన్నాడు.

అందుకామె సమ్మతించి, ధర్మపాలుణ్ణి వెంట బెట్టుకుని తన ఇంటికి వచ్చేసింది.

అది మొదలు ధర్మపాలుడు ఇంటి ముందున్న అరుగు మీద కూర్చునేవాడు. తన యజమానురాలైన వేశ్య ఎలాంటి పని చెప్పినా, "గురువు ఆజ్ఞ," అని చేసేస్తూండేవాడు.

వేళ కింత పెడితే తిని, ఎండాకాలమైనా, చలికాలమైనా, వర్షాకాలమైనా ఆ అరుగు మీదనే పడుకునేవాడు. తన నౌకరు చెప్పిన పను లన్నీ చేస్తూ ఉండటం వేశ్యకు కూడా నచ్చింది. అమే, అమె కూతురూ కూడా ధర్మపాలుడి పట్ల చాలా అభిమానంగానే ఉండేవారు. ధర్మపాలుడు మాత్రం వాళ్ళను గురించి ఆలోచించక, తన గురువు ఉద్దేశ మేమిటో ఊహించటానికి ప్రయత్నించేవాడు. కాని అది అతనికి అంతు పట్టేది కాదు.

కాలం గడుస్తున్నది. ఒకనాడు వాన జోరుగా కురుస్తున్నది. తెల్లవార లేదు. ఇంకా చీకటిగానే ఉన్నది. అప్పుడే నిద్ర లేచి ముఖం కడుక్కుంటున్న ధర్మపాలుడు పుక్కిలించిన నీరు ఉమ్మేశాడు. ఆ నీరు కాస్తా వేశ్య పైన పడింది. అమె ఆ చీకట్లో అరుగు చివరకు రావటం ధర్మపాలుడికి కనిపించలేదు.

ఆమె గబగబా లోపలికి వెళ్ళి, నిద్ర పోతున్న కూతురిని లేపి, "మనం ఏమిటో అనుకున్నాం. మన బానిసవాడికి మన

తిండి బాగా వంటపట్టింది. ఎంత కావరం! నా మీద పుక్కిలించి ఉమ్మేశాడు!" అని ఫిర్యాదు చేసింది.

ఆమె కూతురు నిద్రమత్తున కళ్ళు తెరిచి చూసి, "అదేమిటమ్మా? అలా మారిపోయావూ!" అన్నది. ఆమె కళ్ళు పెద్దవయాయి. నిద్రమత్తంతా వదిలి పోయింది.

తల్లి అద్దంలో తన ముఖం చూసుకుని నిర్ఘాంత పోయింది. ఆమె అందంగానూ పడుచుగానూ, తయారయింది.

తల్లికూతుళ్ళు మాట్లాడుకుని, తమ బానిస ఎంగిలినీరు తగలటం చేతనే ఈ మార్పు జరిగిందనీ, అతనెవరో సిద్ధ పురుషుడై ఉండాలనీ తేల్చుకున్నారు. అతన్ని పెళ్ళిచేసుకోవాలని తన కున్నట్టు కూతురు తల్లితో అన్నది. తల్లికి కూడా ఈ ఉద్దేశం నచ్చింది.

కొంతసేపటికి బాగా తెల్లవారింది. వాన నిలిచిపోయింది.

వేశ్య అరుగు మీదికి వచ్చి, "తలంటి స్నానం చేద్దురుగాని, లోపలికి రండి," అన్నది, ధర్మపాలుడితో.

"గురువు అజ్ఞ," అంటూ ధర్మపాలుడు లేచి వెళ్ళి, అభ్యంగనం చేయించు



కున్నాడు, వాళ్ళిచ్చిన కొత్తబట్టలు కట్టు కున్నాడు, వాళ్ళు పెడితే పంచభక్ష్యపరమా న్నాలతో భోజనం చేశాడు.

ఆ రాత్రికే పెళ్ళిఏర్పాట్లన్నీ జరిగాయి. తన యజమానురాలు ఏం చెయ్యమంటే అది అంతా, "గురువు అజ్ఞ," అంటూ చేస్తున్నాడు ధర్మపాలుడు.

పురోహితుడు చెప్పగా, వేశ్య అతన్ని తన కుమార్తె మెడలో మంగళసూత్రం కట్ట మన్నది. "గురువు అజ్ఞ," అంటూ ధర్మ పాలుడు మంగళసూత్రం కట్టబోతూండగా, గురువుగారే వచ్చేసి, "ఆగండి!" అని కేక పెట్టాడు.

"ఇవిగో, నీ పదివరహాలు. నా మనిషిని నా కిచ్చెయ్యి," అంటూ అతను వేశ్య చేతిలో పదివరహాలు పోశాడు.

ధర్మపాలుడు గురువుకు సాష్టాంగ పడ్డాడు. ఇద్దరూ కదిలి కొంతదూరం వెళ్ళాక, మాలవాడు ధర్మపాలుడికి నమస్కారం చేసి, "మహాత్మా, నాకు తగ్గ శిష్యుడు లేడనుకున్నాను. ఉన్నాడని రుజువయింది. ఇక నీ దారి నీదీ, నా దారి నాదీ," అంటూ వెళ్ళిపోయాడు.

ధర్మపాలుడు అరణ్యాలకు వెళ్ళి, తపస్సు చేసి, జన్మ తరింపజేసుకున్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. మాలవాడు ధర్మపాలుణ్ణి అన్ని తిప్పలూ పెట్టి, ఎటువంటి ఉపదేశమూ తన శిష్యుడికి చెయ్యకుండానే ఎందుకు వెళ్ళిపోయాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధర్మపాలుడి విషయంలో కొత్తగా పొందవలసిన ఉపదేశాలేమీ లేవు. ఆయన చాలా కాలంగా తాత్విక విషయాలు చదివాడు, ఎందరితోనో చర్చించాడు. వాటిని అమలు చేసే అవకాశం లేనందు వల్లనే ఆయనకు అసంతృప్తి కలిగింది. మాలవాడు, ఆయనకు గురువు కావటానికి అంగీకరించక పూర్వమే ఆయనలో ఉండే రాజసాన్నీ, ఆత్మాభిమానాన్నీ వదలగొట్టాడు. అటుతరవాత ధర్మపాలుడు బానిసగా బతకటం కూడా నేర్చుకున్నాడు. అందుచేత గురువు అతనికి ఉపదేశించటాని కేమీ లేకపోయింది. ధర్మపాలుడు ఉపదేశం చెయ్యమని అడగకుండా అరణ్యాలకు వెళ్ళిపోయినది కూడా అందుకే," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# మోసానికి మోసం

ఒక రాజుకు లేక లేక ఒక కొడుకు పుట్టాడు. ఆ కుర్రవాడికి విజయు డని నామకరణం చేసి, ఎంతో గారాబంగా పెంచుతూ వచ్చారు. విజయుడి వయసు గలవాడే మంత్రికొడు కైన గుణనిధి. విజయుడూ, గుణనిధీ ఆబాల్య స్నేహితులుగా, కలిసే సకల విద్యలూ అభ్యసించారు.

ఇద్దరూ యుక్తవయస్కు లయారు. విజయుడికి జయ అనే సౌందర్యవతితో వివాహ మయింది. అతన్ని యువరాజుగా కూడా అభిషేకించారు. అప్పటివరకూ సరిసమానంగా ఉంటూ వస్తున్న విజయ, గుణనిధులలో ఇప్పుడు చాలా తారతమ్యం ఏర్పడింది. ఈ కారణం చేత గుణనిధి మనస్సులో అసూయ తలఎత్తింది.

ఒకనాడు రాజసభకు ఒక గొప్ప యోగి వచ్చాడు. ఆయన విజయుడి కేసి పరీక్షగా చూసి, "రాజా, నే నొక అసాధారణమైన శక్తిని సాధించాను. నేను చనిపోయేలోగా దాన్ని అర్హుడైన వాడికి ఇవ్వాలని సంకల్పించుకున్నాను. మీ విజయుడిలో అర్హత ఉన్న దని నాకు తోస్తున్నది. మీ కేమీ అభ్యంతరం లేకపోతే ఒక మాసంలోగా నా విద్యను ఇతనికి ఇవ్వగలను," అన్నాడు.

రాజు అందుకు సమ్మతించాడు. విజయుడి శక్తిసాధన కొరకు నగరం వెలపల ఒక మందిరం కట్టించి, అందులో యోగి ఉండటానికి తగిన ఏర్పాట్లన్నీ చేశారు. విజయుడు అక్కడికి వెళ్ళి యోగి చెప్పిన విధంగా సాధన చేసేవాడు.

అసలే విజయుడి ఉన్నతి చూసి ఓర్చ లేకుండా ఉన్న గుణనిధి, తన కన్న విజయుడికి ఒక విద్య అధికంగా రావటం ఏ మాత్రమూ సహించలేక పోయాడు. అందుచేత అతను యోగి ఉంటున్న ఇంటి తలుపుకు ఒక చిన్న రంధ్రం చేసి, అందులో

పట్టిసపు శారదాదేవి




నుంచి చూస్తూ, యోగి విజయుడికి నేర్పిన విద్యను తాను కూడా నేర్చుకున్నాడు.

అది పరకాయప్రవేశ విద్య. నెల పూర్తి అయే సరికి ఆ విద్య విజయుడితో బాటు గుణనిధికి వచ్చేసింది.

యోగి వెళ్ళిపోయాక ఒకనాడు విజయుడూ, గుణనిధీ షికారుగా వనం కేసి బయలుదేరారు.

"మిత్రమా, యోగి నీకు నేర్పిన విద్య ఏమిటి?" అని దారిలో గుణనిధి విజయుణ్ణి అడిగాడు, తనకు తెలియనట్టు.

"యోగి వద్ద నేను పరకాయప్రవేశ విద్య నేర్చుకున్నాను," అన్నాడు విజయుడు.

"అలాగా? ఆ వింత నాకు చూపించుదూ!" అన్నాడు గుణనిధి.

వారు వనంలో కొంత దూరం వెళ్ళేసరికి ఒక చెట్టు కింద చనిపోయిన చిలక శరీరం ఒకటి కనిపించింది. గుణనిధి దాన్ని విజయుడికి చూపి, "నువు దీని శరీరంలో ప్రవేశించి ఎగరగలవా? ఊహించుకోవటానికే అసాధ్యంగా ఉన్నది," అన్నాడు.

"అయితే కళ్ళారా చూడు," అంటూ విజయుడు చెట్టు నానుకుని కూర్చుని తన శరీరం వదిలేసి, చిలక శరీరంలో ప్రవేశించి ఎగురుతూ తిరగసాగాడు. ఏమి జరుగుతున్నదీ అతను గ్రహించే లోపలే గుణనిధి తన శరీరాన్ని వదిలి విజయుడి శరీరంలో ప్రవేశించి, కత్తితో తన శరీరాన్ని రెండుగా నరికేసి, ఇంటి దారి పట్టాడు. ఇప్పుడు రాజ్యమూ, జయా కూడా తనకు దక్కుతుందని అతను ఆశపడ్డాడు.

చిలక శరీరంలో ఉన్న విజయుడు వేగంగా ఎగురుతూ వెళ్ళి, తన అంతఃపురంలో ఉన్న భార్యను చేరుకుని, ఆమెకు జరిగిన దంతా చెప్పి, "నా శరీరంలో ఉన్న గుణనిధిని దూరంగా ఉంచే ఎత్తు ఏదైనా వెయ్యి. ప్రస్తుతానికి నన్ను ఎక్కడైనా రహస్యంగా దాచు," అన్నాడు.

జయ చిలకను రహస్యంగా తన పడకగదిలో దాచింది.

కొంత సేపటికి గుణనిధి తిరిగి వచ్చాడు. అతన్ని చూసి అందరూ విజయుడనే అనుకున్నారు. అతను తన తండ్రి అయిన మంత్రిని కలుసుకుని జరిగిన దంతా చెప్పి, "నా శరీరం వనంలో ఫలాని చోట ఉన్నది. దాన్ని తెప్పించి దహనక్రియలు చేసెయ్యి. ఆ తరవాత నేనూ నువూ కలిసి హాయిగా రాజ్యం ఏలుకుందాం," అన్నాడు.

మంత్రి దుర్మార్గుడు కాదు, కాని ఆయన చేయగలిగినది ఇప్పు డేమీ లేదు. అందుచేత మాట్లాడక ఊరుకున్నాడు.

గుణనిధికి ఒక్కటే సాధ్యం కాలేదు, అతను అంతఃపురంలో ప్రవేశించలేక పోయాడు. అతను లోపలికి పోబోతూంటే దాసీలు అతన్ని ఆపి, "యువరాణీగారు ఈ ఉదయమే ఏదో వ్రతం ప్రారభించి, ఎవరితోనూ మాట్లాడటం లేదు. వ్రతం ఉద్యాపన అయిన దాకా తమరిని అంతఃపురంలోకి రానివ్వవద్దని వారి అజ్ఞ!" అని చెప్పారు.

జయకు నిజం తెలిసిపోయిందేమో నని గుణనిధి మొదట భయపడ్డాడు గాని, తెలిసే అవకాశం లేదని తనకు తాను ధైర్యం చెప్పు




కున్నాడు. ఎందుకైనా మంచిదని అతను తన మనుషుల చేత దొరికిన చిలక లన్నిటినీ తెప్పించాడు; పెంపుడు చిలకలు ఎవరి వద్ద నన్నా ఉన్నట్టు తెలిస్తే వాటిని డబ్బిచ్చి కొన్నాడు; అన్ని చిలకలనూ గొంతులు నులిమి చంపించేశాడు.

ఈ వార్త విన్న మీదట జయకు చిలక చెప్పిన విషయంలో బాగా నమ్మకం కుదిరింది. ఆమె తన భర్తను కాపాడుకునే ఏర్పాట్లన్నీ చేసుకుని, అతని శరీరంలో చేరి ఉన్న గుణనిధికి కబురు పంపింది. అతను పరమానందంతో అంతఃపురంలో జయను చూడటానికి వచ్చాడు.

జయ చాలా ఆప్యాయంగా అతన్ని చూసి, మందహాసం చేసి, "ఇవాళతో నా వ్రతానికి ఉద్యాపన అయింది. బ్రాహ్మణులకు సంతర్పణ చేసే ఏర్పాట్లు చూడండి," అన్నది.

"అదెంతసేపు?" అంటూ గుణనిధి వెయ్యిమంది బ్రాహ్మణులకు భోజనాలు ఏర్పాటు చేశాడు. వాళ్ళు బారులలో కూర్చుని భుజిస్తూండగా ఒక చచ్చిన మాల కాకి బారుల మధ్య పడింది. ఈ పని చేసినది జయ పరిచారికలే.

బ్రాహ్మణులంతా విస్తళ్ళ ముందు నుంచి లేవబోతూంటే జయ వారిని లేవ వద్దనీ, ఆ కాకి క్షణంలో ఎగిరిపోతుందనీ చెప్పింది. ఆమె తన పక్కనే ఉన్న గుణనిధితో రహస్యంగా, "మీకు పరకాయ ప్రవేశ విద్య తెలుసు గదా? ఆ కాకిలో ప్రవేశించి దాని శరీరాన్ని మరెక్కడైనా పడేసి రండి," అన్నది.

గుణనిధి సరే నని తన శరీరాన్ని లోపల ఒక గదిలో వదిలి, కాకిలో ప్రవేశించి ఎగిరి దూరంగా వెళ్ళిపోయాడు. బ్రాహ్మణులు పరమానందభరితులై భోజనాలు కానిచ్చారు.

ఈ లోపుగా, చిలక శరీరంలో ఉన్న విజయుడు తన శరీరంలో ప్రవేశించి జయ దగ్గిరికి వచ్చి, "పీడ వదిలి పోయింది!" అన్నాడు ఉత్సాహంగా.

బ్రాహ్మణుల భోజనాలు అయిన అనంతరం మాలకాకి శరీరంతో గుణనిధి తిరిగి వచ్చాడు. అతన్ని జయ దగ్గిరికి పిలిచి పట్టుకుని, చిలకను రహస్యంగా దాచి ఉంచిన పంజరంలో ఆ కాకిని బంధించి, కప్పుకు వేళ్ళాడ గట్టింది. విజయుడు తన శరీరంలో తిరిగి ప్రవేశించినట్టు గ్రహించి, గుణనిధి తనకు ఎలాటి శాస్తి జరిగినదీ తెలుసుకున్నాడు.

జయ మాలకాకిని ఎందుకు పంజరంలో పెట్టి పెంచుతున్నదీ ఎవరికీ అర్థం కాలేదు.





# అసలు విషయం

చిత్రపురి రాజ్యాన్ని ఏలే చతురవర్మ పేరుకు తగ్గట్టే చాలా తెలివైనవాడు. అతను రాజ్యాన్ని చాలా సమర్థతతో పాలిస్తూ ప్రజలకు ఎలాటి కష్టాలూ, అన్యాయాలూ జరగకుండా చూసుకునేవాడు. ప్రజల కష్టాలను స్వయంగా తెలుసుకునేటందుకు అతను అప్పుడప్పుడూ మారువేషంలో సంచారం చేస్తూ ఉండేవాడు.

ఒకసారి రాజుకు ఏదో జబ్బు చేసింది. చాలా రోజులపాటు సంచారం చెయ్యటం పడలేదు. అందుచేత ఆయన తన మంత్రినీ, సేనాపతినీ పిలిచి, "మీరు మారువేషాలలో బయలుదేరి వెళ్ళి, ఎక్కడ ఏమి జరుగుతున్నదీ తెలుసుకుని రండి," అని పంపాడు.

వాళ్ళు రాజు చెప్పినట్టే బయలుదేరి తిరుగుతూ, రాత్రి చాలా పొద్దుపోయి సింగవరం అనే గ్రామం చేరారు. చాలాదూరం ప్రయాణం చేసివచ్చి అలసి ఉన్నందున వారు గ్రామం బయట ప్రవహించే సెలయేటిలో నీరు తాగి, గుర్రాలను కూడా తాగించి, వాటిని చెట్లకు కట్టి, కాలినడకన గ్రామం ప్రవేశించారు.

గ్రామంలో వీధి నిర్మానుష్యంగా ఉన్నది. కాని ఒక ఇంటి ముందు అరుగు మీద ఇద్దరు పిల్లలు కూర్చుని దేనికోసమో నిరీక్షిస్తున్నట్టు కనబడ్డారు. గ్రామమంతా గాఢ నిద్రలో మునిగి ఉన్న సమయంలో ఈ పిల్లలు మేలుకుని ఉండటమేగాక, దేనికోసమో నిరీక్షిస్తూ ఉండటం మారువేషాలలో ఉన్న మంత్రి సేనాపతులకు ఆశ్చర్యం కలిగించింది.

మంత్రి వాళ్ళ సమీపంలో ఆగి, "ఇంత రాత్రివేళ మీరిద్దరూ ఇక్కడ కూర్చుని ఏం చేస్తున్నారు?" అని అడిగాడు.

"సూర్యుడి కోసం ఎదురు చూస్తున్నాం," అన్నాడు పిల్లల్లో పెద్దవాడు.

కె. ప్రభాకరరావు

ఈ సమాధానం మంత్రికి చాలా ఎబ్బెట్టుగా తోచింది.

"ఇంట్లో పెద్దవాళ్ళెవరూ లేరా?" అని సేనాపతి పిల్లలను అడిగాడు.

"కాలిపోయే కట్టెకు విషంపోసి కాలుడితో కయ్యమాడబోయాడు సూర్యుడు," అన్నాడు రెండో కుర్రాడు.

ఈ సమాధానం మరీ విడ్డూరంగా ఉన్నది. మంత్రి సేనాపతులు ఇక ఆ పిల్లలను ఏమీ అడగక అక్కణ్ణించి ముందుకు సాగిపోయారు.

వాళ్ళు తిరిగి వచ్చాక రాజదర్శనం చేసుకుని, తాము తమ సంచారంలో చూసిన విషయాలన్నీ చెప్పి, సింగవరంలో పిల్లలు అన్న మాటలుకూడా చెప్పారు.

రాజు ఆ మాటలు విని చిరునవ్వు నవ్వి, "రేపు ఆ పిల్లల తండ్రిని దర్బారుకు పిలిపించండి," అన్నాడు.

మర్నాడు రాజుగారు నిండు కొలువులో ఉండగా పిల్లల తండ్రి వచ్చి, చేతులు జోడించుకుని రాజుగారి ఎదట నిలబడ్డాడు.

"నీ పేరు సూరయ్య కాదూ?" అని అడిగాడు రాజు.

"చిత్తం," అన్నాడు పిల్లల తండ్రి.

"విషవైద్యంలో ఘటికుడవని విన్నాను. నిజమేనా?" అన్నాడు రాజు.



"ఏదో, తమ దయ!" అన్నాడు సూరయ్య.

"దౌర్భాగ్యు లిద్దరు దాపరించారు. దారి చూపుతావా?" అని రాజు అడిగాడు.

"ఎవరు వాళ్ళు?" అన్నాడు సూరయ్య.

"కాయుడి సర్పం విరిచాడొకడు. తిరిగే పాదరక్షలు తరగటంలేదు," అన్నాడు రాజు.

"రెండోవాడేం చేశాడు?" అని సూరయ్య అడిగాడు.

"ఖజానా ద్వారం కమ్మీ విరిచాడు. దారి చెడిపోయింది," అన్నాడు రాజు.

"చుక్కలేసే చక్రవర్తు లేం చేస్తున్నారు?" అని సూరయ్య అడిగాడు.

"చుక్కల వంక చూస్తున్నారు. నువ్వీ దౌర్భాగ్యానికి దారి చూపాలి. ప్రతిఫలముంటుందిలే!" అన్నాడు రాజు.

"చిత్తం" అని సూరయ్య, రాజుగారి చెంప మీద ఫెడీఫెడీ రెండు దెబ్బలు కొట్టి, రాజును సింహాసనం మీది నుంచి కిందికి ఈడ్చి బోర్లా పడేసి, ఆయన వీపులో తన మోకాలితో నాలుగు తాపులు తన్నాడు.

రాజభటులు పరిగెత్తుకుంటూ వచ్చి, సూరయ్యను పెడరెక్కలు విరిచికట్టారు.

రాజుగారు నవ్వుతూ లేచి నిలబడి, సింహాసనం మీద తిరిగి కూర్చుని, "ఎవరూ కంగారు పడవద్దు. చాలా రోజులుగా నా వెన్నుపాములో నొప్పి ఏర్పడి, నడవటానికైనా సాధ్యం కాకుండా ఉన్నది. పుప్పిపళ్ళ మూలాన భోజనం కూడా చెయ్యలేక బాధ పడుతున్నాను. ఆస్థాన వైద్యులు చికిత్స చెయ్యలేకపోయారు. ఈ సూరయ్య గొప్ప వైద్యుడని తెలిసి, చికిత్స కోసం పిలిపించాను. అతను మీ ఎదటే నా జబ్బులు రెంటికీ చికిత్స చేశాడు," అని సభికులకు తెలియబరిచాడు.

తరవాత ఆయన సూరయ్యకు గొప్పగా సన్మానం చేసి మరీ పంపేశాడు. అప్పుడందరికీ అసలు విషయం అర్థమయింది.





# హిందువుల పద్ధతులు

ఒక నవాబు ఒక హిందూ రాజును యుద్ధంలో ఓడించి అతని రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. రాజ్యంలో అందరూ హిందువులే కనక వాళ్ళ పద్ధతులను సక్రమంగా అమలు జరగనిచ్చి, వారి సంస్కృతిని నిలబెట్టి, వారి సద్భావం సంపాదించుకుని, వారిలో ఎలాటి అరాచకభావాలూ చెలరేగకుండా పరిపాలన ప్రశాంతంగా కొనసాగించాలని అనుకున్నాడు. ఓడిపోయిన రాజు ఆస్థానంలో ఉండిన పండితులనూ, పురోహితులనూ అలాగే ఉండనిచ్చాడు. తాను హిందువుల పద్ధతులను గురించి ఎంతో శ్రద్ధగా తెలుసుకుంటూ వచ్చాడు. పండితుల చేత సంస్కృతం చదివించి అర్థం చెప్పించుకున్నాడు. పురాణాలూ శాస్త్రాలూ చదివించుకుని విన్నాడు.

నవాబు అంగరక్షకుడైన ఖాసింఖానుకు కూడా నవాబుతో బాటు నాలుగు సంస్కృతం ముక్కలు తలకు పట్టాయి. కాని నవాబు పద్ధతులు అతని కేమీ నచ్చలేదు. హిందువులను ఎలాగైనా అవమానించాలని అతను అనుకున్నాడు. అతను అస్తమానమూ నవాబుగారి హుక్కాకు నిప్పు వేస్తూండేవాడు. ఈ పనిని ఆస్థాన పురోహితుడికి అంటగట్టటానికి అతడికి ఒక మంచి ఆలోచన తట్టింది.

ఖాసింఖాన్ ఒకనాడు నవాబుతో, "హుజూర్, హిందువుల పద్ధతి ప్రకారం తమ హుక్కాకు నిప్పు వేయవలసినవాడు ఆస్థానపురోహితుడు," అన్నాడు.

"ఈ సంగతి నాకు తెలీదే! ఎందుచేత?" అన్నాడు నవాబు.

"అగ్ని మీళే పురోహితం అని వాళ్ళు మంత్రం చెబుతారు. పురోహితుడే అగ్ని పెట్టవలిసిందీ అని ఆ మాటకు అర్థం," అన్నాడు ఖాసింఖాన్.

టి. శేషావతారం

"ఓహెూ, అలాగా?" అని నవాబు పురోహితుణ్ణి పిలిచి, "అగ్ని మీళే పురోహితం అని మీ శాస్త్రంలో ఉందిట గద? నా హుక్కాకు నిప్పు అందించడం ఇక నుంచీ మీ పనే," అన్నాడు.

"నిజమే," అంటూ పురోహితుడు హుక్కా తీసుకుని, నిప్పు కణికలు వేసి, "ఇక దీని సంగతి మీరే చూసుకోండి, ఖాన్ గారూ!" అని హుక్కాను ఇవ్వబోయాడు.

"అదేమిటి?" అన్నాడు నవాబు.

"పునరేవా వరుంధే. అనగా మొదటి వాడే తిరిగి ఈ పని చెయ్యవలసిందీ అని," అని పురోహితుడు లేచి చక్కాపోయాడు.

పాపం, ఖాసింఖాన్‌కు నవాబుగారి హుక్కా పని వదలలేదు.

* * *

ఇంకోసారి నవాబుగారు రామాయణం వింటూండగా, భరతుడు రాముడి పాదుకలకు పట్టాభిషేకం చేసిన ఘట్టం వచ్చింది. పాదుకా పట్టాభిషేకం ద్వారా రాముడి పట్ల ప్రజలకు గల ప్రేమాభిమానాలు వ్యక్తమయాయి. తన పాదుకలను కూడా ఊరేగించి, వాటికి పట్టాభిషేకం చేయించినట్టయితే తన సామంతులూ, ప్రజలూ తనను రాముడంతటి వాడనుకుంటారు. తన పేరు కూడా శాశ్వతంగా నిలుస్తుంది.



ఇలా అనుకుని నవాబు రాజ్యమంతటా చాటింపు వేయించి, తన పాదుకలు అన్ని గ్రామాలకూ ఊరేగింపుతో వస్తాయనీ, అందరూ తమతమ కానుకలు చెల్లించి, ఆ పాదుకలకు జరిగే పట్టాభిషేక మహోత్సవంలో పాల్గొనవలసిందనీ నౌకర్ల చేత కబురు పంపాడు.

ఈ చాటింపు వినగానే అందరికీ చిరాకూ, చింతా పట్టుకున్నాయి. ఈ దుస్సంఘటన ఎలా తప్పించుకోవటమా అని బుద్ధిమంతులు నలుగురూ చేరి ఒక ఉపాయం ఆలోచించారు.

మర్నాడు ఉదయానికల్లా నవాబు మందిరం ముందు అనేక వేలమంది గుమికూడి కోలాహలం చెయ్యసాగారు.

"ఆ అల్లరి ఏమిటో కనుక్కోండి," అని నవాబు తన భటులను పంపాడు.

వాళ్ళు తిరిగి వచ్చి, "తమ పాదుకలకు పట్టాభిషేకమని విని జనం అల్లాడిపోతున్నారు, హుజూర్. 'నవాబుగారి కేం ప్రమాదం వచ్చింది? వారి ఆరోగ్యం బాగా లేదా? వారిక మమ్మల్ని పాలించరా? వారు రాజ్యం వదిలేసి వనవాసం పోతున్నారా?' అని అడుగుతున్నారు, హుజూర్," అని చెప్పారు.

నవాబు ఆశాభంగం చెందాడు. ఆయన అనుకున్నది ఒకటీ, జరిగినది మరొకటీ అయింది.

"నేను ఖులాసాగానే ఉన్నానని ఆ జనానికి చెప్పండి. నేను ఏ అరణ్యవాసమూ పోవటంలేదు. పాదుకలకు పట్టాభిషేకం నిలిపివేయబడిందని కూడా జనానికి చెప్పి, వాళ్ళను వెళ్ళిపొమ్మనండి," అన్నాడు నవాబు నీరసపడిపోతూ.

పాదుకాపట్టాభిషేకం నిలిపివేయబడిందని తెలియగానే జనం, బతుకు జీవుడా అనుకుని, ఉత్సాహంగా తమ తమ ఇళ్ళకు తిరిగి వెళ్ళిపోయారు.





# శనిప్రభావం

ఉజ్జయినీ నగరాన్ని విష్ణువర్ధను డనే రాజు పరిపాలించే కాలంలో ఆ నగరంలో దేవ శర్మ అనే బీద బ్రాహ్మణు డుండేవాడు. ఆయన జ్యోతిషంలో చాలా గట్టివాడు. అయినా ఆయనను దారిద్ర్యం బాగా పీడిస్తూ వచ్చింది. ఆ దారిద్ర్యం నుంచి బయట పడటాని కాయన గట్టి ప్రయత్నం కూడా చెయ్యలేదు. దొరికిన దానితో తృప్తిపడుతూ తన కాలాన్ని గణపతిని ఆరాధించటంలో గడిపేవాడు; అస్తమానమూ గణపతి గుడిలో కూర్చుని, ఆ దేవుడిపై స్తోత్రాలు రచించి, చదువుతూ ఉండేవాడు.

భార్య అతన్ని నిత్యమూ పోరేది, ఎవరి నైనా ఆశ్రయించి ధనం సంపాయించుకు రమ్మనేది. తన దశ బాగాలేదనీ, మంచి దశ వచ్చే దాకా తన ప్రయత్నా లేవీ ఫలించవనీ, కొంతకాలం ఓపికపట్టమనీ దేవశర్మ భార్యతో అనేవాడు.

ప్రతి ఉదయమూ రాజుగారి ఇంటి ముందు కొందరు బ్రాహ్మణులు చేరి, స్వస్తివాచకాలు చదివి, రాజుగారి నుంచి సంభావనలు పుచ్చుకునేవారు. దేవశర్మను కూడా అలాగే చెయ్యమన్నది భార్య.

భార్య పోరు పడలేక దేవశర్మ ఒక ఉదయం రాజుగా రింటికి వెళ్ళాడు. కాని ఆయన అక్కడ చేరిన బ్రాహ్మణులకు ఎడంగా నిలబడ్డాడు. వాళ్ళతో పాటు రాజును ఆశీర్వదించలేదు. ఆ స్వస్తివాచకా లకు విలువలేదని ఆయన ఉద్దేశం. అయితే రాజుగారు స్వస్తివాచకాలు చదివినవారికే సంభావన లిచ్చాడు. దేవశర్మ కేమీ ముట్ట లేదు. రాజుగారు లోపలికి వెళ్ళిపోగానే రాజభటులు అందరితో పాటు దేవశర్మను కూడా బయటికి పంపేశారు.

అయినా దేవశర్మ తన భార్య సంతృప్తి కోసం ప్రతి ఉదయమూ రాజమందిరానికి

వి. కామేశ్వరరావు



వెళుతూనే ఉన్నాడు, వట్టి చేతులతో తిరిగి వస్తూనే ఉన్నాడు. ఈ విధంగా కొద్ది రోజులు గడిచాక రాజుగారికి దేవశర్మను గురించి ఆశ్చర్యం కలిగింది. ఆయనను తాను రోజూ చూస్తున్నాడు. ఆ బ్రాహ్మణు డెవరో గాని ప్రతి ఉదయమూ వస్తాడు, స్వస్తివాచకం చదవడు. సంభావన కోసం చెయ్యిచాచడు. సంభావన కోసమూ కాక, స్వస్తివాచకం చదవటానికీ కాక ఆయన రోజూ ఎందుకు వస్తున్నట్టు?

ఈ సంగతి తేల్చుకునే టందుకని రాజు ఒకనాడు ఉదయం తన భటులతో, "బ్రాహ్మణులు సంభావన పుచ్చుకునే టప్పుడొక పేద బ్రాహ్మణుడు చినుగులు పట్టిన పచ్చ శాలువా కప్పుకుని కొంచెం ఎడంగా నిలబడి ఉంటాడు. బ్రాహ్మణు లందరూ సంభావనలు తీసుకుని వెళ్ళి పోయేటప్పుడు ఆ బ్రాహ్మణుణ్ణి నా గదిలోకి పంపండి," అని చెప్పాడు.

ఆ రోజు బ్రాహ్మణులు స్వస్తివాచకాలు చదివి, రాజుగారిచ్చిన సంభావనలు పుచ్చుకుని వెళ్ళి పోతుంటే, వాళ్ళ వెనకగా దేవశర్మ కూడా వట్టి చేతులతో బయలుదేరాడు. కాని రాజభటులు ఆయనను ద్వారం వద్ద ఆపి, తమ వెంటబెట్టుకుని రాజుగారి గదికి తీసుకుపోయారు.

తాను పేదవాడిననీ, దానం కోసం వస్తున్నాను గాని సంభావన కోసం కాదనీ దేవశర్మ రాజుతో చెప్పాడు. రాజు ఆయన పరిస్థితి అర్థం చేసుకుని, ఒక పెద్ద వెండి బరిణలో అయిదువందలు వెండినాణాలు నింపి, ఆయనకిచ్చాడు.

దేవశర్మ దాన్ని తీసుకుని ఇంటికి వెళ్ళి తన భార్యకు చూపాడు. ఆమె చాలా సంతోషించింది.

"దశ బాగాలేదని మీరు చేతులు ముడుచుకుని కూర్చోక పోయినట్టయితే మన దారిద్ర్యం ఏనాడో తీరిపోయేది. నయం,

ఇప్పటికైనా నా మాటవిన్నారు," అన్నదామె.

"అంతా ఆ గణపతి దయ," అన్నాడు దేవశర్మ.

ఆ రాత్రే దేవశర్మ ఇంట దొంగ ప్రవేశించి, రాజుగారిచ్చిన వెండి బరిణను వెండి నాణాలతో సహా ఎత్తుకుపోయాడు. దేవశర్మ భార్య పొందిన సంతాపం ఇంతా అంతా కాదు. దేవశర్మ మాత్రం, "శని ప్రభావం! ఎలా తప్పించుకోగలం?" అన్నాడు.

నిన్న తన వద్ద అంత పెద్ద మొత్తం దానంగా పుచ్చుకుపోయిన బ్రాహ్మడు అదే చింకి శాలువతో ఇవాళ ఉదయం ప్రత్యక్షమైతే రాజుకు ఆశ్చర్యం కలిగింది. ఆయన ఆ బ్రాహ్మణ్ణి పిలిచి, "ఏమయ్యా, బ్రాహ్మడా? నిన్న నే నిచ్చిన డబ్బుతో నీ దారిద్ర్యం తొలగిపోయిం దనుకున్నానే. మళ్ళీ ఈ పేదవేషంతోనే ప్రత్యక్షమయావేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, నా దారిద్ర్యానికి అసలు కారణం నా గ్రహదశ బాగా లేకపోవటం. నన్ను శనిపట్టి పీడిస్తున్నాడు. బంగారం పట్టుకుంటే మట్టి అయిపోతుంది. నా భార్య పోరుపడలేక రోజూ వస్తున్నప్పటికీ, చెయ్యి చాచి తమరిని యాచించని కారణం కూడా అదే! నిన్న తామిచ్చిన బరిణ రాత్రి





దొంగలపాలయింది. నాకు స్వల్పమైనా దక్షిణ ఇప్పించండి, చాలు," అన్నాడు దేవశర్మ.

రాజుకు శనిమహిమలో నమ్మకం లేక పోయింది. తాను తలుచుకుంటే దేవశర్మను ధనవంతుణ్ణి చెయ్యవచ్చుననీ, శని అడ్డు పడలేడనీ ఆయన అనుకుని, ఇంకా పెద్ద బరిణలో వెయ్యి వెండి నాణాలు పోసి ఆ బ్రాహ్మణుడికిచ్చి, వాటితో సుఖంగా కాలక్షేపం చేసుకోమన్నాడు.

కాని దేవశర్మ దాన్ని ఇంకా ఆరుమాసాల దాకా వినియోగించ దలచలేదు. ఎందు కంటే అయన అంచనాప్రకారం తన కింకా ఆరు మాసాలదాకా శని పీడ వదలదు. ఆయన ఆ బరిణను గణపతి గుడి వద్దకు తెచ్చి, తన ధనాన్ని కాపాడే భారం గణపతి పైన వేసి, గుడి పక్కన ఉండే పురాతన వృక్షం తొర్రలో దాన్ని జారవిడిచి, ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ చెట్టు బోదెలో చిన్న, పెద్ద తొర్రలు అనేకం ఉన్నాయి. వాటిలో విషసర్పాలు కాపరం ఉంటున్నాయి. ఆ చెట్టును ఎక్కి, పాముకాటు తిని కొందరు చనిపోవటం చేత, ఆ చెట్టు జోలి కెవరూ పోరు. అందుచేత తన బరిణకు దొంగల భయం ఉండదని దేవశర్మ అనుకున్నాడు.

దేవశర్మ ఇక రాజు వద్దకు పోనేలేదు. అయితే అతని దారిద్ర్యం ఎప్పటి లాగే ఉన్న సంగతి రాజుకు తెలియవచ్చింది. దానికి కారణ మేమంటే, దేవశర్మకు తెలియకుండా రాజు ఆయన ఇంటికి నలుగురు భటులను కాపలా ఏర్పాటు చేశాడు. మొదటిసారి తానిచ్చిన దానం లాగా ఈ రెండోది కూడా దొంగలపాలు కాకూడదనీ దాని ఫలం దేవశర్మకు పూర్తిగా ముట్టాలనీ రాజు ఉద్దేశం.

కొంత కాలమయాక రాజుగారికి దేవ శర్మ జ్ఞాపకం వచ్చాడు. ఆయన రక్షక

భటులను పిలిపించి, ఆ బ్రాహ్మణుడు సుఖంగా ఉంటున్నాడా అని అడిగితే, వాళ్ళు, దేవశర్మ ఇంకా దారిద్ర్యంలోనే మునిగి తేలుతున్నట్టు చెప్పారు.

రాజు చాలా ఆశ్చర్యపడి భటులను పంపి దేవశర్మను పిలిపించాడు. దేవశర్మ ఎప్పటి లాగే పచ్చని చింకి శాలువతో రాజు ముందు ప్రత్యక్షమయాడు.

"నా దగ్గిర తీసుకున్న ధనమంతా ఏం చేశావు? దాన్ని వాడుతున్నట్టు లేదే?" అన్నాడు రాజు.

"లేదు మహారాజా. శని ధశ తొలగి పోగానే వాడదామని మీ రిచ్చిన బరిణను పాములచెట్టు తొర్రలో దాచాను," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు తన మనుషులను బ్రాహ్మణుడి వెంట పంపి చెట్టుతొర్రలో బరిణె కోసం వెతకమని ఆజ్ఞాపించాడు. వాళ్ళు వచ్చి చెట్టు తొర్రలో వెతికి చూశారు. బరిణ జాడ దొరకలేదు.

దేవశర్మ రాజుతో, "అది ఎక్కడికీ పోదు, మహారాజా. దాన్ని నా అభిమాన దైవమైన గణపతి సురక్షితంగా ఉంచుతాడు. నాకు శని తొలగిపోగానే గణపతి తిరిగి ఇచ్చేస్తాడు. మీరు విచారించకండి," అని చెప్పాడు.



"నీ కింకా ఎంత కాలం ఉంది శని?" అని రాజు అడిగాడు.

"ఇంకా ఆరునెల లున్నది," అన్నాడు దేవశర్మ.

"ఈ ఆరునెలలూ గడవకుండానే నిన్ను ధనవంతుణ్ణి చేస్తాను. శని ఎలా అడ్డపడతాడో చూస్తాను," అంటూ రాజు మరొక బరిణలో బంగారు నాణాలు నింపి తెప్పించి, "ఈ బరిణను నువు ఇంటికి తీసుకుపోయి, ఈ రోజు నుంచే వాడుకో. నీకు దొంగల భయం లేదు. నా మనుషులు నీ ఇంటికి అహోరాత్రాలు కాపలా ఉన్నారు. ఏ కారణంగా నైనా నువు ఈ బంగారాన్ని వాడుకోని పక్షంలో నిన్ను కఠినంగా శిక్షిస్తాను," అని హెచ్చరించాడు.

దేవశర్మ ఆ బరిణ తీసుకుని ఇంటికి పోతూ, దారిలో గణపతి ఆలయం దగ్గిర ఆగి, తనను కాపాడే భారం ఆ దేవుడి మీదనే వెయ్యాదలచి, బరిణను గుడి బావి బొడ్డుమీద ఉంచి, తాను నీరు తోడుకుని స్నానం చెయ్యసాగాడు. ఆయన బొక్కెన ఎత్తి నెత్తిన నీరు పోసుకుంటూండగా, ఆ బరిణ మీద ఒక కాకి వాలి, వెంటనే ఎగిరిపోయింది. బరిణ బావిలో పడింది. స్నానం చేస్తున్న దేవశర్మకు ఈ సంగతి ఏమీ తెలియదు.



కాని ఆయన స్నానం పూర్తిచేసి బరిణ కోసం చూసుకుంటే అది తాను పెట్టిన చోట లేదు. దాన్ని శనీశ్వరుడే స్వయంగా ఎత్తుకు పోయి ఉంటాడని ఆ బ్రాహ్మణుడు నమ్మాడు. తనను కాపాడమని గణపతిని వేడుకుని ఆయన ఇంటికి పోయి, తన ఇంటికి కాపున్న రక్షకభటులతో, "మీరు వెళ్ళిపొండి. నా ఇంట దొంగలు దోచు కునేది ఏమీలేదు," అన్నాడు.

రక్షకభటులు రాజుతో ఆమాట చెప్పగానే రాజు దేవశర్మను పిలిపించి, "నే నిచ్చిన బంగారం కూడా పోయిందా? ఎలా పోయింది?" అని అడిగాడు.

"అది ఎక్కడికీ పోదు, మహారాజా. నా కింకా మంచికాలం రాలేదు గనక శని దేవుడే దాన్ని ఎత్తుకుపోయి ఉంటాడు," అన్నాడు దేవశర్మ.

రాజుకు చాలా కోపం వచ్చింది, "నిర్భాగ్యుడా! నీకు నువే శనిదేవతవు. నీ లెక్క ప్రకారం శని రోజులు పోగానే నే నిచ్చిన దంతా దొరకకపోతే నిన్ను కొరత వేయిస్తాను. వెళ్ళు," అన్నాడు.

"దొంగలు ఎత్తుకుపోయిన వెండిమూట ఏమోగాని, గణపతిని కాపాడమని ఇచ్చినదీ, శని దాచినదీ తప్పక దొరుకుతాయి," అంటూ దేవశర్మ రాజు దగ్గిర శలవు పుచ్చుకున్నాడు.

తరవాత కొద్ది రోజులకు పెద్ద గాలివాన వచ్చింది. ఆ గాలి దెబ్బకు గణపతి ఆలయంలో ఉన్న పురాతన వృక్షం కూకటి వేళ్ళతో సహా విరిగి, పక్కనే ఉన్న బావి మీద పడింది. దాని వేళ్ళ మధ్య చిక్కుకుని, రాజు ఇచ్చిన వెయ్యినాణాల వెండి బరిణ బయట పడింది. బావిని పూడిక తీసి బాగుచేసేటప్పుడు బంగారు నాణాల బరిణ కూడా దొరికింది.

రాజు దేవశర్మ మూఢనమ్మకాన్ని అబద్ధం చెయ్యలేకపోయాడు.





# తల్లిప్రేమ

ఒక గ్రామంలో ఒక పేదరాలికి ముత్తు అనే కొడుకు ఉండేవాడు. తల్లికి వాడంటే తగని గారాబం. తాను కష్టపడి పని చేసి సంపాదించిన డబ్బుతో కొడుకును ఎంతో ఆప్యాయంగా పెంచింది. ముత్తుకు తినటమూ, తోటివాళ్ళతో ఆడుకోవటమూ తప్ప వేరే పని లేదు.

అయితే ముత్తు ఒక సంగతి గమనించాడు. తన యీడు కుర్రాళ్ళందరూ తమకు చాతనైన పని లేవో చేసి, తల్లి దండ్రులకు సహాయంగా ఉంటున్నారు. తాను కూడా అదే విధంగా తల్లికి సహాయపడదా మని ముత్తు అనుకున్నాడు, కాని తన కొడుకు శ్రమించటం తల్లికి ఇష్టం లేకపోయింది. ఉన్న ఊళ్ళో తాను పని చెయ్యటానికి తల్లి ఒప్పుకోదు. అందుచేత మరే వూరైనా వెళ్ళి పని చెయ్యాలన్న ఉబలాటం ముత్తుకు కలిగింది. అందుకు కూడా తల్లి ఒప్పుకోదని తెలిసి, ముత్తు ఒకనాడు తల్లికి చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరాడు.

వాడు చాలా దూరం ప్రయాణం చేసి ఒక గ్రామం చేరి, అక్కడ ఒక ధనికుడి ఇంట పనికి కుదిరాడు. ధనికుడి వద్ద ఒక సంవత్సరం పని చేశాక వాడికి తల్లి మీద గాలి మళ్ళింది. వాడు ఈ మాట యజమానితో చెబితే ఆయన వాడికి ఒక వెండి అచ్చు బహుమానంగా ఇచ్చి, దాన్ని జాగ్రత్తగా ఇంటికి చేర్చ మన్నాడు. ముత్తు పని చేసిన కాలంలో ధనికుడి ఇంట రెండు పెళ్ళిళ్ళు జరిగాయి. అప్పుడు ధనికుడు తన నౌకర్ల కందరికీ కట్నాలూ, కానుకలూ దండిగా ఇచ్చాడు. ముత్తు తాను పని చేసిన కాలంలో జీతండబ్బులు కూడా ఏమీ తీసుకోలేదు. అందుచేత ఇప్పుడు వాడికి ఇంత వెండి దొరికింది. దాన్ని వాడు తన పైబట్ట కొంగున కట్టుకుని భుజాన

ఎస్. జయలక్ష్మి

వేసుకుని, ఎంతో ఉత్సాహంగా తన గ్రామానికి బయలుదేరాడు.

నడుస్తున్న కొద్దీ ముత్తుకు వెండిమూట భారం పెరిగిపోతున్నట్టు అనిపించింది. ఆ బరువు మూలాన చురుకుగా నడవలేక పోయాడు. అయినా, ఆ వెండి చూసి తల్లి సంతోషిస్తుందన్న ఆశతో, వాడా మూటను భుజాలు మార్చి మోస్తూ నడిచాడు.

ముత్తు కొంత దూరం వెళ్ళాక ఒక మనిషి గుర్రం మీద ఎక్కి ఎదురొచ్చాడు. దాన్ని చూడగానే ముత్తుకు, తనకు అటు వంటి గుర్రం ఉంటే తాను వేగంగా తల్లిని చేరుకోవచ్చు గదా అనిపించింది. వాడు గుర్రం మీద వచ్చేవాణ్ణి పలకరించి, "ఏమండీ, ఇటువంటి గుర్రం ఖరీదు ఎంత ఉంటుంది?" అని అడిగాడు.

"నీ దగ్గిర ఏమున్నది గుర్రాన్ని కొన టానికి?" అని గుర్రంమనిషి అడిగాడు.

ముత్తు ఆ మనిషికి తన వెండి చూపాడు. ఆ మనిషి ఆ వెండి తీసుకుని గుర్రాన్ని ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. ముత్తు తన వెండి కాస్తా ఆ మనిషి కిచ్చి, అతని సహా యంతో గుర్రం మీద ఎక్కి కూర్చున్నాడు.

ముత్తు ఎక్కి కూర్చోగానే ఆ గుర్రం శరవేగంతో దౌడు ప్రారంభించింది. దాని



వేగాన్ని అదుపు చెయ్యటం గాని, దాన్ని తన ఇష్టం వచ్చిన దిక్కుగా నడిపించటం గాని ముత్తుకు సాధ్యం కాలేదు.

గుర్రం అలా దౌడుతీసి పోతూంటే ఒక చోట ఆవులను మేపుతున్న వాడొకడు ముత్తు పరిస్థితి గమనించి, కర్ర ఎత్తి గుర్రానికి ఎదురు వచ్చి, దాన్ని ఆపటానికి ప్రయత్నిం చాడు. గుర్రం ఆగింది, కాని ఆగే ముందు వెనక కాళ్ళ మీద లేచి, ముత్తును కింద పడేసింది.

తరవాత ఆవులను మేపేవాడు ముత్తును లేవదీసి, "జానెడు లేవు. నీకి గుర్రం స్వారీ ఏమిటి? అసలీ గుర్రం నీ కెలా



వచ్చింది? ఎక్కడైనా దొంగిలించ లేదు కదా?" అని అడిగాడు.

ముత్తు తన సంగతంతా ఆ మనిషితో చెప్పుకున్నాడు.

"నువ్వు చాలా పొరపాటు చేశావు. ఈ గుర్రాన్ని చూసి మీ అమ్మ ఏమని సంతోషిస్తుంది? అంతకన్న, చెప్పిన మాట వినే ఒక ఆవును తోలుకు పోయినట్టయితే మీ అమ్మ చక్కగా పాడి చేసేది గద. ఇప్పుడైనా మించిపోయింది లేదు. నా కీ గుర్రాన్నిచ్చి, మంచి ఆవును తీసుకుని ఇంటికి వెళ్ళు. మీ అమ్మ నిన్ను మెచ్చుకుంటుంది," అన్నాడు ఆవులను మేపే మనిషి.

ఆవు దూడలను పెడుతుందనీ, ఇంటి నిండా ఆవులమంద తయారవుతుందనీ ఊహించుకుని ముత్తు గుర్రాన్నిచ్చి ఆవును తీసుకోవటానికి ఒప్పుకున్నాడు. కాని ఆ ఆవులను మేపేవాడు వాడికి ఒక వట్టిపోయిన ముసలి ఆవు నిచ్చి పంపేశాడు.

ముత్తు ఆవును తోలుకుంటూ బయలు దేరాడు. వాడికి మధ్యాన్నం అయినప్పటి నుంచీ ఆకలి దహించుకుపోతున్నది. సాయంకాలం దాకా ఆగితే ఆవు పాలిస్తుందనీ, అవి తాగి కడుపు నింపుకోవచ్చు ననీ వాడు అనుకున్నాడు.

సూర్యాస్తమయం వేళకు ముత్తు ఒక మేకలమంద ఉండే చోటికి చేరాడు. వాడు మేకల కాపరిని అడిగి ఒక చెంబు తీసుకుని తన ఆవును పితకటానికి ప్రయత్నించాడు. పాలు రాకపోగా ఆవు తన్నసాగింది.

ఇదంతా చూస్తున్న మేకలకాపరి నవ్వి, "ఇది ముసలి ఆవు. నీ కేం పాలిస్తుంది? దీన్ని ఎక్కడ సంపాదించావు?" అని ముత్తు నడిగాడు.

ముత్తు వాడికి తన కథంతా చెప్పాడు.

"పాపం, నిన్ను చిన్నవాణ్ణి చేసి మోసం చేశారు. ఈ ఆవును ఇక్కడే వదిలేసి, ఒక మంచి పాడిమేక నిస్తాను, తీసుకుపో. కొద్ది

కాలంలోనే నీకూ ఒక మేకలమంద ఏర్పడుతుంది," అన్నాడు మేకల కాపరి.

వాడు తానిస్తా నన్న మేకను పితికి ముత్తుకు తాగటానికి దాని పాలు కూడా ఇచ్చాడు. ముత్తు తృప్తి పడి ఆ మేకను తోలుకుంటూ ఇంటి దారి పట్టాడు.

కొంత దూరం పోయాక మేక ముత్తు వెంట రాక, వెనక్కు పోవటానికి ప్రయత్నిస్తూ, "మే, మే" అని గట్టిగా అరవసాగింది. దానితో పెనుగులాడేటందుకు ముత్తుకు శక్తి చాలలేదు.

ఇంతలో ఒక మనిషి చంకలో కోడిపుంజును పెట్టుకుని అటుగా వచ్చి, "ఎందు కబ్బాయీ, ఆ మేకతో ఘర్షణ పడుతున్నావు? ఇది నీది కాదా? దీన్ని ఎక్కడికి తీసుకుపోతున్నావు?" అని అడిగాడు. ముత్తు ఆ మనిషికి తన కథంతా చెప్పేశాడు.

కోడిపుంజు మనిషి అంతా విని, "మీ ఊరు ఇంకా చాలా దూరం ఉంది. ఈ మేకను బలవంతాన అంత దూరం నువు నడిపించలేవు. దీన్ని నాకు వదిలేసి ఈ కోడిని తీసుకో. ఇది రోజుకు పదేసి గుడ్లు పెడుతుంది. చూస్తుండగానే మీ ఇల్లంతా కోళ్ళమయం అవుతుంది. మీ అమ్మ సంతోషిస్తుంది," అన్నాడు.



ముత్తుకు ఈ సలహా నచ్చింది. ఆ మనిషి చేతిలో వున్నది కోడిపుంజనీ, అది గుడ్లు పెట్టదనీ కూడా ముత్తుకు తెలీదు. వాడు బాధ విరగడయిందే చాలనుకుని, మేకను ఆ మనిషి కిచ్చి, కోడిపుంజును తీసుకుని బయలుదేరాడు.

వాడు కొంత దూరం పోయాక ఒక గ్రామంలో ఒక చోట ఒక మనిషి అనేక కత్తులు తన ముందు పోగేసుకుని, పాత రాయి మీద ఒక్కొక్కటే సాన పడుతున్నాడు. ముత్తు ఆగి, వాడు చేసే పని చూసి, "ఎందు కిట్లా చేస్తున్నావు?" అని అడిగాడు.

"కత్తులకు పదును పెడుతున్నాను. ఈ కత్తులన్నీ పదును పెట్టానంటే రూపాయి డబ్బులు వస్తాయి. ఒక పూట పని," అన్నాడు సానవాడు.

"నాకూ డా అటువంటి రాయి ఉంటే బాగుండునే!" అన్నాడు ముత్తు.

"నా దగ్గిర ఇంకో రాయి ఉంది, కావలిస్తే అమ్ముతాను," అన్నాడు సానవాడు.

"కొనటానికి నా దగ్గర ఈ కోడి తప్ప ఏమీ లేదు," అన్నాడు ముత్తు.

"పోనీ అదే తే!" అంటూ సానవాడు కోడిపుంజును తీసుకుని ఒక సానరాయి ముత్తు కిచ్చాడు.

ముత్తు ఆ రాయితో తన గ్రామం చేరుకుని తల్లితో, తాను ధనికు డిచ్చిన బరువైన వెండిసుద్దను సానరాయి కింద ఎట్లా మార్చినదీ చెప్పాడు.

"పిచ్చి, వెధవా! అంత వెండి పోగొట్టుకుని ఈ పనికిమాలిన రాయి తెచ్చావా? వెండి పోతే పోయిందిలే. నువు తిరిగి వచ్చావు అంతే చాలు," అన్నది తల్లి.

ఆ తరవాత ఆమె వాణ్ణి పనిలో ప్రవేశించనిచ్చింది. ముత్తు మంచి పనిమంతుడు కావటం వల్ల తల్లికన్న ఎక్కువే సంపాదించి, తల్లిని సుఖపెట్టాడు.





# రాజుకు తగ్గ మంత్రి

ఒక అస్తవ్యస్తపు రాజుండేవాడు. అతనికి మరింత అస్తవ్యస్తపు మంత్రి ఉండేవాడు. ఒక బ్రాహ్మడు రోజూ రాజుగారి వద్దకు వచ్చి తిథి వారాలు చెప్పి వెళ్ళుతూండే వాడు. ఒకరోజు రాజుగారికి సందేహం వచ్చింది. "ఈ బ్రాహ్మడు ప్రతిరోజూ తిథి వారాలు చెప్పి వెళతాడుగదా. అవి ఎలా ఉంటాయో, మన మెన్నడూ కళ్ళ చూడ లేదే!" అన్నా డాయన మంత్రితో.

"అతన్నే అడుగుదాం," అన్నాడుమంత్రి.

మర్నాడు బ్రాహ్మడు రాగానే రాజు, "ఏమయ్యా, బ్రాహ్మడా? నువు మాకు రోజూ తిథి వారాల పేర్లే చెబుతావు గాని వాటిని మా కెన్నడూ చూపించావు కావు. మేము వాటి నెన్నడూ కళ్ళ చూడలేదు. ఒక్కసారి తెచ్చి చూపించు," అన్నాడు.

బ్రాహ్మడికి గుండెల్లో రాయి పడింది. తిథి వారా లెట్లా ఉంటాయో తాను కూడా ఎన్నడూ చూడలేదు. చూడలేదంటే రాజు కోప్పడి, "నీకే తెలియని వాటిని గురించి మాకు చెబుతావా?" అంటాడేమో! అందు కని అతను చేతులు నులుపుకుంటూ, "మహారాజా, క్షమించండి. చాలా పేద వాణ్ణి! తిథి వారాలను తీసుకుపచ్చి చూపటం నావశమా?" అన్నాడు.

"చాలా ఖరీదై ఉంటాయి! సందేహం లేదు," అన్నాడు మంత్రి.

"ఎంత ఖరీదైనా ఫరవాలేదు, మంత్రీ. బొక్కసంలో నుంచి ఈ బ్రాహ్మడికి రెండు వేల వరహా లిప్పించు. అంతా వేగిరం జరిగిపోవాలి," అన్నాడు రాజు,

మంత్రి డబ్బు తెప్పించి బ్రాహ్మడికిస్తూ, "తిథి వారాలను వీలయినంత త్వరలో తెచ్చి చూపే భారం నీది!" అన్నాడు.

బ్రాహ్మడు ఆ డబ్బు మూటగట్టుకుని తిథి వారాలు కొనుక్కురావటానికి బయలు

ఆర్. సుజాతకుమారి



దేరాడు. అవి ఎక్కడ అమ్ముతాయో అతడికి తెలీదు, కాని ఆ మాట రాజుతోనూ, మంత్రి తోనూ అనటానికి భయం.

"అయ్యా, తమ దుకాణంలో తిథి వారాలున్నాయా?" అని బ్రాహ్మడు చాలామంది వర్తకులను అడిగాడు. అందరూ లేవన్నారు, కొందరు బ్రాహ్మణ్ణి చూసి నవ్వాడు. బ్రాహ్మడు చాలా ఊళ్ళు తిరిగాడు. చివరకు ఒక ఊళ్ళో ఒక సెట్టి, "లేకేం? ఇంకా సరుకు కిందికి దించలేదు. అటక మీదినుంచి దింపి ఉంచుతాను. రేపు వచ్చి పట్టుకు పొండి," అన్నాడు. బ్రాహ్మడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

ఆ రాత్రి సెట్టి బోనుపెట్టి, రెండు ఎలుకలను పట్టి, వాటిని ఒక చిన్న పెట్టెలో పెట్టి, మూతకు తాళం వేసి, బ్రాహ్మడి దగ్గిర రెండువేల వరహాలూ తీసుకుని, ఆ పెట్టె ఇచ్చేస్తూ, "వీటిని తిన్నగా మీ రాజుగారి వద్దకే తీసుకుపోయి అక్కడ తెరవండి. మధ్య దారిలో పెట్టె తెరవవద్దు. ఇదుగో తాళంచెవి," అన్నాడు.

బ్రాహ్మడు పరమానందంతో తిరిగి వస్తూ, "సెట్టి మధ్య దారిలో పెట్టె తెరవవద్దన్నాడు గదా; ఈ తిథి వారాలను ముందుగా నేను చూడకపోతే రాజుగా రడిగే ప్రశ్నలకు నేనేం సమాధానం చెప్పాలి? నేను వాటిని ముందుగా చూసి ఉండటం అవసరం," అనుకుని పెట్టె తెరవ నిశ్చయించాడు.

అతనప్పుడొక కొండ మార్గాన నడుస్తున్నాడు. కనుచూపుమేరలో ఎవరూ లేరు. తిథి వారాలను కళ్ళారా చూసి, వాటి సంగతి ఏమిటో తెలుసుకోవటానికి ఇదే మంచి అవకాశమనుకుని, బ్రాహ్మడు పెట్టెను భద్రంగా ఒక చట్రాయి మీద పెట్టి, బొడ్డు నుంచి తాళంచెవి తీసి తాళం తెరిచి, పెట్టె మూత పైకెత్తాడు. మరుక్షణంలో పెట్టెలో ఉన్న రెండు ఎలుకలూ బయటికి దూకి, మెరుపులాగా మాయమయాయి. చత్వారం

చేతనూ, ఎలుకల వేగంమూలానా బ్రాహ్మడు వాటి ఆకారాలను పోల్చుకోలేకపోయాడు.

బ్రాహ్మడి గుండెలో రాయిపడింది. బోలె డంత డబ్బు పోసి కొన్న తిథి వారాలు తన అజాగ్రత్త వల్ల పారిపోయాయంటే రాజుగా రేమంటారో? అయినా జరిగినది రాజుగారికి విన్నవించక తప్పదుగద! అందుకని ఆయన రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, జరిగినదంతా చెప్పి, "మహారాజా! నాదే పారపాటై పోయింది. సెట్టి సరి అయిన తిథి వారా లిచ్చాడో లేదో చూతామని పెట్టె తెరిచాను గాని, లేకపోతే తెరవకనేపోదును," అని విచారంగా విన్నవించుకున్నాడు.

"ఈ భాగ్యాని కింత విచారందేనికయ్యా, వెర్రిబ్రాహ్మడా? కొండను తవ్విస్తే అవే దొరుకుతాయి," అన్నాడు రాజు.

కొండను తవ్వించేపని తాను స్వయంగా దగ్గిర ఉండి చేయించే నిమిత్తమై రాజుగారు పనివాళ్ళనూ, బ్రాహ్మణ్ణీ వెంటబెట్టుకుని, తిథి వారాలు తప్పించుకుపోయిన చోటికి వెళ్ళాడు. తవ్వకంపని ప్రారంభమయింది.

ఒక నెల గడిచింది. కొండ తవ్వే పని లక్షవంతు కూడా పూర్తికాలేదు. ఇంతలో మంత్రి వద్ద నుంచి ఒక మనిషి వచ్చి, "మహారాజా, మంత్రిగారు పెద్ద చిక్కులో ఉన్నారు. తాము ఎలా ఆజ్ఞాపిస్తారో అలా



చెయ్యాలని ఎదురు చూస్తున్నారు!" అని చెప్పాడు.

"ఏం జరిగిం దేమిటి?" అని రాజు అడిగాడు.

"ఏలినవారు నగరు నుంచి బయలుదేరి నాక మహారాణీగారి పెద్ద దాసీకి తేలు కుట్టింది. విషం పైకెక్కుతున్నదని తెలియగానే మంత్రిగారు దాసీదాని కాలు నరికించేసి విషం ఎక్కకుండా చేశారు. తరవాత తేలు కోసం ఎంత వెతికినా కనిపించలేదు. అది ఇంట్లో ఉన్నట్టయితే ఇంకెంత మందిని కుట్టి బాధిస్తుందోనని మంత్రిగారు రాజ భవనానికి అగ్గిపెట్టించేశారు. రాజభవనం అంటుకుని ఎంతకూ ఆరిపోకపోయేసరికి తూర్పు చెరువుకు గండిపెట్టించేశారు. అందువల్ల నిప్పు చల్లారింది గాని తూర్పు చేలన్నీ నీరులేక ఎండిపోయేటట్టున్నాయి. వాటిని ఎలా కాపాడాలో మంత్రిగారికి తెలియక, తాము సమయానికి దగ్గిర లేకపోయారే అని చాలా బాధపడిపోతున్నారు. ఈ పరిస్థితిలో తమరు ఏం చెయ్యమంటే అలా చెయ్యటానికి సిద్ధంగా ఉన్నారు," అన్నాడు మంత్రి పంపిన మనిషి.

రాజుగారు కొంచెంసేపు యోచించి, "దీనికింత గుంజాటన దేనికి? పడమటి చేలు కోయించి, దానితో తూర్పు చేల మీద పందిరి వేయించమను. అలా చేస్తే తూర్పు చేలు ఎండవు! అంతే!" అని సమాధానం చెప్పి ఆ మనిషిని పంపేశాడు.

రాజుకు తగ్గ మంత్రి రాజుగారు చెప్పినట్టే చేశాడు. వాళ్ళిద్దరి తెలివితేటల ఫలితంగా ఆ యేడు రాజ్యంలో తిండిగింజలు లేవు. రాజభవనం దగ్ధమయింది. రాణిగారి పెద్దదాసీది కుంటిదై పోయింది. నిక్షేపమైన కొండదారి కాస్తా నడవటానికి వీలులేకుండా పోయింది. ఆ రాజ్యంలో బతకటం సాధ్యం కాక యాయవారపు బ్రాహ్మడు మరో దేశానికి వెళ్ళిపోయాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు తమతో కుశల ప్రశ్నలు చేశాక మునులు చాలా సంతోషించి, తాము తెచ్చిన బదరీఫలాలను అతనికి కానుకగా ఇచ్చి, "మేము పెద్ద పని మీదే నీ వద్దకు వచ్చాం. భూదేవి కొడుకైన నరకుడు రాక్షస నాయకుడు. వాడిది ఉద్దండ పరాక్రమం. వాడు సముద్రాలు ఇంకించ గలడు, భూమిని చలింపజేయగలడు, కొండ లను అణగదొక్కగలడు. వాడు లోకా లన్నిటినీ గగ్గోలు పరుస్తున్నాడు. ఒకసారి బదరీవనానికి వచ్చి, యజ్ఞకార్యంలో నియుక్తులమై ఉన్న మమ్మల్ని చూసి, దేవతలను గురించి యజ్ఞం చెయ్యవద్దనీ, తనను గురించి చెయ్యమనీ అడిగాడు. అందుకు మేము ఒప్పుకోక పోయేసరికి, వాడు అలిగి, తన అనుచరుల చేత మా అగ్నులు ఆర్పించి, మా వస్తువులన్నీ ధ్వంసం చేసి, మా స్త్రీలను చెరపట్టి తీసుకు పోయాడు. మా కర్మకాండకు భగ్నం కలగటమే గాక, మా మర్యాద మంట గలిసింది. మాకు తీరని దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. మమ్మల్ని నువే కాపాడాలి," అన్నారు.

మునులు అన్న మాటలకు కృష్ణుడికి ఆశ్చర్యమూ, నరకుడి పైన ఆగ్రహమూ కూడా కలిగింది. కాని అతను ఏ మాటా అనకుండా కొంతసేపు నిశ్చలంగా ఉండి పోయి, ఆలోచనలో పడ్డాడు. అది చూసి మునులు భయపడ్డారు, అనుమానపడ్డారు, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

## 20. నరకాసుర వధ



అప్పుడు సాత్యకి మొదలైన యాదవ ప్రముఖులు కూడా కృష్ణుణ్ణి హెచ్చరించారు. కృష్ణుడు మునుల కేసి తిరిగి, "మీరు మరొక విధంగా అనుకోకండి. ఆ రాక్షసుడి చర్యలు విన్న కోపంలో నా మనసు క్షోభపడింది. నేను నిశ్చయంగా ఆ రాక్షసుణ్ణి నిర్మూలిస్తాను. మీ కేమీ భయం లేదు. మీరు వెళ్ళి మీ నిత్య కృత్యాలు కొనసాగించండి," అంటూ వారికి అభయం ఇచ్చాడు.

కృష్ణు డిచ్చిన మాటతో మునుల ముఖాలు వికసించాయి. వాళ్ళు కృష్ణుణ్ణి రకరకాల అభినందించి, వెళ్ళివస్తామని



చెప్పి అతని వద్ద సెలవు పుచ్చుకుని, బదరికాశ్రమానికి తిరుగు ప్రయాణం సాగించారు.

మునులు వెళ్ళిపోయిన అనంతరం ద్వారకకు దేవేంద్రుడు, మిగిలిన దిక్పాలకులతో సహా దిగి వచ్చాడు. కృష్ణుడు వారికి ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. ఇంద్రుడు యాదవ ముఖ్యుల నందరినీ ఆలింగనం చేసుకుని, వారిపై తనకు గల అభిమానాన్ని ప్రకటించాడు. తరవాత సుధర్మ సభాభవనంలో అందరూ సభ చేశారు.

ఇంద్రుడు కృష్ణుడి చేతిని తన చేతిలోకి తీసుకుని, "నేను నిన్ను చూడటానికి ఇలా బయలుదేరి వచ్చిన కారణం చెబుతాను విను. నరకు డనే దైత్య నాయకుడు బ్రహ్మ చేత వరాలు పొంది, విజృంభించి దేవతలను యుద్ధంలో చిత్తుగా ఓడించాడు. వాడి ధాటికి తట్టుకోలేక, ఇళ్ళూ వాకిళ్ళూ వదిలేసి, మనుష్య లోకానికి పారిపోయి వచ్చాం. మా ఇళ్ళలో ప్రవేశించి వాడు మా సంపద లన్నిటినీ కొల్లగొట్టాడు. మా పాట్లు ఏమని చెప్పను? ఎవరికీ సాధ్యం గాని అదితిదేవి కుండలాలను కూడా వాడు కాజేశాడు. మునుల ఆశ్రమాల నన్నిటినీ వాడు భీభత్సం చేశాడు. జగద్రక్షణకు



కంకణం కట్టుకుని నువు అనేకమంది రాక్షసులను చంపినట్టు విని వాడు నిన్ను ఓడించాలని మహా తహతహలాడుతూ ఉన్నాడు. కనక నువు వెళ్ళి వాడి అంతు తేల్చటం మంచిది. అందువల్ల లోకాలకు ఎంతో మేలు కలుగుతుంది. ఇడుగో గరుత్మంతుడు, నీకు వాహనం కావడానికి నాతో కూడా వచ్చాడు," అంటూ గరుత్మంతుణ్ణి చూపాడు.

ఇలా అన్న దేవేంద్రుడితో కృష్ణుడు, "ఈ విషయాలన్నీ మునుల వల్ల ఇంతకు ముందే విన్నాను. నీ రాకతో నా నిశ్చయం మరింత దృఢమయింది. ఇప్పుడే బయలుదేరి ప్రాగ్జ్యోతిష పురానికి పోదాం," అంటూ ఆసనం మీది నుంచి దిగి, యాదవ ప్రముఖులకు వీడ్కోలు చెప్పి, తన చక్రాయుధం మొదలైన ఆయుధాలు తీసుకుని, సత్యభామకు కబురు పంపి, ఆమెతో సహా గరుడవాహనం ఎక్కాడు. పెద్దలు దీవించారు, వందిమాగధులు స్తోత్ర పాఠాలు చదివారు. ఇంద్రుడు ముందు దారి తీస్తూంటే కృష్ణుడు వెనకగా బయలుదేరాడు. కొంత దూరం నేలమార్గాన వెళ్ళాక, ఇంద్రుడూ, కృష్ణుడూ కూడా ఆకాశ మార్గాన ప్రయాణం సాగించారు.



కృష్ణుడికి ఆకాశం నుంచి ప్రాగ్జ్యోతిష పురం కనిపించింది. అది ఎవరికీ ప్రవేశించ సాధ్యం కానిది. దాని సైనికరక్షణలు ఎలా ఉన్నదీ కృష్ణుడు తెలుసుకున్నాడు. నరకుడి మందిరాన్ని రక్షించే రాక్షసవీరులను చూశాడు. కృష్ణుడు ఇంద్రుడికి వీడ్కోలు చెప్పి, ముందుకు వెళ్ళి, ఆ రాక్షసులను తాకి, అనేకమందిని చెండాడాడు.

మురాసురుడు కృష్ణుడితో తలపడి భయంకరమైన యుద్ధం సాగించాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో మురాసురుడి తల తెగవేశాడు. తరవాత నిసుందుడనేవాడు యుద్ధం ప్రారంభించి, సత్యభామ చేతిని





గాయపరిచి, రక్తం కారేటట్టు చేశాడు. కృష్ణుడు మండిపడి, బాణాలతో వాడి చేతులూ, తలా నరికేశాడు. హయగ్రీవుడూ, అఘోరపాలుడూ, విరూపాక్షుడూ, ప్రావఘుడూ, పంచజనుడూ మొదలుగా గల రాక్షస వీరులు ఎనభైనాలుగు వేలమంది కృష్ణుడి చేతిలో చచ్చారు.

నగరద్వారాన్ని రక్షించే రాక్షసు లందరినీ చంపి కృష్ణుడు ఆ ద్వారాన్ని సమీపిస్తూండగా రాక్షస సేనలు అతనిపై వచ్చి పడ్డాయి. కృష్ణుడు ఆ రాక్షస మూకను అవలీలగా చించిచెండాడాడు. ఇంతలో నరకుడే యుద్ధసన్నద్ధుడై వచ్చాడు. అతను,



ఒంటరిగా యుద్ధానికి వచ్చిన కృష్ణుణ్ణి చూసి, "నన్ను నరకు డంటారు. ఇంద్రుణ్ణీ, ఇతర దేవతలనూ జయించి, మూడులోకాలనూ సంక్షోభింప జేసినవాణ్ణి. నా దగ్గర ఎంతలేసి వీరుల పరాక్రమాలూ ఎందుకూ పనికిరావు. నువ్వు ఎవరివి? ఎందుకు వచ్చా విక్కడికి? ఈ పెద్ద పక్షి ఎక్కడిది? ఈ ఆడమనిషి ఎవరు? కొంచెం స్పష్టంగా చెప్పు. విన్నిప్పుడే చంపి, ఈ స్త్రీని వశపరుచుకుంటాను. పారిపోక పోరాడు," అన్నాడు.

కృష్ణు డీ మాటలకు నవ్వి, "నేను కూడా మూడు లోకాలలోనూ ప్రసిద్ధికన్నవాణ్ణే. నన్ను గురించి నువు విన్నావో, లేదో తెలీదు. నా పేరు వాసుదేవుడు. ఈమె పేరు సత్యభామ, నా భార్య. ఈ పక్షి పక్షిజాతికి రాజైన గరుత్మంతుడు, నా వాహనం. నే నిక్కడి కెందుకు వచ్చానంటే, నిన్ను చంపి లోకకల్యాణం కలిగించటానికి వచ్చాను," అన్నాడు.

నరకుడు చిరునవ్వు నవ్వి, "నీవేనా వాసుదేవుడివి? నీతో యుద్ధం ఎప్పుడు వస్తుందా అని ఉబలాట పడుతున్నాను. నీ శక్తి కొద్దీ యుద్ధం చెయ్యి. నాకు దొరికి ప్రాణాలతో తప్పించుకు పోలేవులే," అంటూ కృష్ణుడితో యుద్ధం ప్రారంభిం





చాడు. వారికి జరిగిన యుద్ధం రామరావణ యుద్ధంలాగా వర్ణించ శక్యంకానిది, మహా దారుణమైనది. ఈ యుద్ధంలో కృష్ణుడు తీవ్రంగా గాయపడి మూర్ఛపోయాడు.

అది చూసి సత్యభామ కంగారుపడక, కృష్ణుడి నుదుట గుచ్చుకున్న బాణాన్ని తీసి, రక్తస్రావం కాకుండా గాయాన్ని నొక్కిపెట్టి, కృష్ణుడికి ఉపచారాలు చేసింది. గరుత్మంతుడు తన రెక్కల గాలితో కృష్ణుడికి సేద తీర్చాడు. కృష్ణుడు స్పృహవచ్చి సత్యభామ కేసి చూస్తూ, "నేను అలిసిపోయినాను. కాస్సేపు నువు యుద్ధం చెయ్యి," అన్నాడు. సత్యభామ అతని విల్లూ, అమ్ముల పొదులూ తీసుకున్నది.



ఆమె తన పైన ఒక్కసారిగా బాణ వర్షం కురిపించేసరికి నరకుడు, "ఈ కృష్ణుడు తాను యుద్ధం చెయ్యటం మాని, నన్ను జయించటానికి ఆడదాన్ని నియోగిస్తాడా? ఛీ, ఛీ!" అనుకుని, సత్యభామ పైన తీవ్రమైన బాణాలు ప్రయోగించాడు. అవి సత్యభామ రొమ్ములలోనూ, చేతులలోనూ, పక్కలలోనూ గుచ్చుకున్నాయి. ఆమె వాటిని లక్ష్యపెట్టక, అత్యంత రోషావేశంతో నరకుడి ధ్వజం విరగగొట్టి, రథాశ్వాలను చంపి, సారథిని చంపింది. నరకుడు బాణం ఎత్తినప్పుడల్లా దాన్ని విరగగొట్టింది. ఇలా మూడు బాణాలు విరిగిపోయేసరికి నరకుడు గద ఒకటి తీసుకుని, బలంగా ఆమె మీద విసిరాడు. దాన్ని సత్యభామ మధ్యలోనే నలుసులకింద కొట్టేసింది. ఇదేవిధంగా ఆమె నరకుడు విసిరిన ప్రతి ఆయుధాన్నీ నుగ్గు చేసేసింది.

సత్యభామ చేసే అద్భుత యుద్ధానికి కృష్ణుడు తృప్తిపడి, ఆమెను కౌగలించుకుని, నుదుటి మీది చెమట తుడిచి, "అలసిపోయావు. ఇక యుద్ధం చాలించు," అని ఆమెను ప్రశంసించి తన మెడలో ఉన్న రత్నాల హారాన్ని ఆమె మెడలో వేశాడు.





రొమ్ముకు గురిచేసి విసిరాడు. కృష్ణుడు అవలీలగా దాన్ని ఖండించాడు. నరకుడు కృష్ణుడి పైన ఎన్నో ఆయుధాలూ, చివరకు చెట్లూ, రాళ్ళూ కూడా విసిరాడు, కాని ప్రయోజనం లేకపోయింది.

చిట్టచివరకు కృష్ణుడు నరకుడి పైన తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. అది నరకుణ్ణి నిలువునా రెండుగా చీల్చి పారేసింది. నరకుడి చావుతో భూమికి గొప్ప బెడద తీరిపోయింది. భూదేవి మానవాకారంతో వచ్చి, నరకుడి శవాన్ని కౌగలించుకుని, అతని చెవులకు గల దివ్య మణికుండలాలు తీసి, కృష్ణుడి వద్దకు వచ్చి, ఏడుస్తూ, చేతులు మోడ్చి, "నువే నా కీ కొడుకును ఇచ్చావు, నువే వాణ్ణి లోక కంటకుడని భావించి చంపేశావు. ఇక దేవతలూ, ఋషులూ సుఖంగా ఉండనీ. ఇవి ఇంద్రుణ్ణి జయించి తెచ్చిన రత్నకుండలాలు. వీటిని తీసుకో. వీడి కొడుకును కాపాడి, వీడి రాజ్యం వాడికియ్యి," అన్నది.

కృష్ణుడు సరేనన్నాడు. భూదేవి అంతర్ధానమయింది. కృష్ణుడు నరకుడి కళేబరానికి అంత్యక్రియలు జరిపించి, అతని కొడుకైన భగదత్తుడికి రాజ్యాభిషేకం చేయించాడు.

ఆ హారాన్ని సంపాదించాలని రుక్మిణీ, సత్యభామా కూడా కోరుకున్నారు. ఇంతవరకు ఇద్దరికీ అది లభించలేదు. అటువంటి హారం ఇప్పుడు సత్యభామకు లభించింది.

కృష్ణుడు సత్యభామ చేతి నుంచి విల్లు తీసుకుని తిరిగి యుద్ధానికి ఉపక్రమించాడు. ఈ లోపల నరకుడు మరొక రథం ఎక్కి, శరపరంపరలను కృష్ణుడి పైనా, సత్యభామ పైనా, గరుత్మంతుడి పైనా విసిరాడు. కృష్ణుడు అతని కొత్త రథాన్నీ, గుర్రాలనూ, సారథినీ వరసగా ధ్వంసం చేశాడు. అప్పుడు నరకుడు క్రోధావేశంతో గద తీసుకుని, నేల పైకి దిగి, కృష్ణుడి





నగరంలోపల అంతులేని నిధులున్నాయి. అవి దిక్పాలకులను జయించి, నరకుడు తెచ్చుకున్నవి. నరకుడి కింది అధికారులు వాటి నన్నిటినీ కృష్ణుడి పరం చేశారు.

మణిశైలం వద్ద పదహారువేల నూరు మంది దేవతా స్త్రీలు నరకుడి చేత చెర పట్టబడి తెచ్చి ఉంచబడ్డారు. కృష్ణుడు సపరివారంగా అక్కడికి వెళ్ళాడు. ఆ స్త్రీలు కృష్ణుణ్ణి చూసి, "మేము నరకుడి చేత చెర పట్టబడిన దేవ స్త్రీలం. ఒకసారి నారదుడు మా దుఃఖం చూసి, చింతించ వద్దనీ విష్ణుమూర్తి మానవావతారుడై వచ్చి, నరకుణ్ణి చంపి, మాకు భర్త అవుతాడనీ చెప్పాడు. మేము ఆ ఆశతోనే ఇంతకాలమూ మా కష్టాలను ఓర్చాం. ఇప్పుడు మేము ధన్యత్వం పొందాం," అన్నారు.

కృష్ణుడు వారి కోరికను మన్నించి, వారిని స్నేహంతో చూసి, వారి కోసం పల్లకీలు తెమ్మని రాక్షసకింకరులను నియోగించాడు. తరవాత కృష్ణుడు మణిశైల మంతా తిరిగి, దాని శిఖరం ఒకటి చెట్లతోనూ, పక్షులతోనూ సహా విరిచి, గరుత్మంతుడి పైన పెట్టాడు. గరుత్మంతుడు కూడా దాన్ని తేలికగా మోశాడు. కొండశిఖరంతో బాటు కృష్ణుడు కూడా ఎక్కి, ఇంద్రుడి నగరానికి ప్రయాణమై వెళ్ళాడు. అక్కడ శచీదేవీ, ఇంద్రుడూ ఉన్నారు. శచీదేవీ, సత్యభామా కౌగలించుకున్నారు. కృష్ణుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, తాను తెచ్చిన కుండలాలు అతనికి ఇచ్చాడు. కృష్ణుడు నరకుణ్ణి చంపినందుకు శచి సత్యభామను ప్రశంసించింది.

"నీ కిష్టమైన దేదైనా ఇవ్వాలని ఉన్నది. ఏమిటి నీ కోరిక?" అని శచీదేవి సత్యభామను అడిగింది.

"నా కే కొరతా లేదు. నీ స్నేహం తప్ప నా కింకేమీ అక్కర్లేదు," అన్నది సత్యభామ.





# అరణ్యపురాణం

## 23

ఇప్పుడు మౌగ్లీకి వానరులంటే ఏ మాత్రమూ లక్ష్యం లేదు. వానరులకే మౌగ్లీ అంటే గుండె దడ. అయితే మౌగ్లీ శిథిలాలను చేరే సమయానికి వానరమూకలు అరణ్యంలోని కొన్ని ప్రాంతాల మీదికి దాడి పోయి ఉండటం చేత శిథిలాలు నిర్జీవంగా ఉన్నాయి. అంతటా నిశ్శబ్దం, వెన్నెల కాస్తున్నది.

కావా మిద్దె ప్రాంతం మీద ఉండే రాణి వాసపు మేలుకట్టు మీదుగా పాకి, దాని మధ్యగా ఉన్న మెట్ల వెంబడి కిందికి దిగ సాగాడు. ఆ మెట్లు కూడా శిథిలావస్థ లోనే ఉన్నాయి.

"మనమూ మనమూ ఒకటే," అని మౌగ్లీ పాముభాషలో కేక పెట్టాడు. అతను మెట్లు దిగటానికి కాళ్లమీదా చేతులమీదా కూడా కదలవలసి వచ్చింది. మెట్ల దిగువన దారి ఏటవాలుగా దిగిపోయింది. అది అనేక మెలికలుగల దారి. కొంతదూరం పోయాక రాతి కట్టడంలో నుంచి ఒక పెద్ద వేరు తోసుకు వచ్చి ఉండటం కనిపించింది. దాని తాలూకు మహా వృక్షం మొదలు ముప్పై అడుగులు ఎగువన ఉన్నది. వాళ్ళు ఒక ఇరుకు సందుకుండా దూరి ఒక నేల గది లోకి అడుగు పెట్టారు. అది చాలా విశాలంగా ఉన్నది. డిప్పలాగా ఉన్న దాని కప్పు నుంచి కూడా అక్కడక్కడా చెట్ల వేళ్ళు దిగాయి. కప్పులో రంధ్రాలు ఏర్పడటంవల్ల కొద్దిపాటి కాంతికిరణాలు గదిలోకి ప్రవేశిస్తున్నాయి.

"ఇది చాలా క్షేమకరమైన గుహ. అయితే రోజూ వచ్చి పోవటానికి మరీ దూరమై పోయింది. ఇక్కడ మనం చూడ వలిసినదేమిటి?" అన్నాడు మౌగ్లీ.

"నేనున్నాను కానా?" అని గది మధ్య నుంచి ఒక కంఠం ప్రశ్నించింది. ఏదో

అట్ట చివరి బొమ్మ





"వేట సాగాలి," అన్నాడు మౌగ్లీ. అతను కత్తిని అస్తమానమూ బొడ్డున పెట్టుకు తిరిగినా, అరణ్య మర్యాదలను పాటించటం మరిచిపోడు.

తెల్లపడగ మౌగ్లీ మాటకు బదులు చెప్పక, "నగరం ఎలా ఉంది? నూరు ఏనుగులూ, ఇరవైవేల గుర్రాలూ, లెక్కించరానన్ని పశువులూ గల మహా నగరం! ఇరవై మంది రాజులకు రారాజు ఏలే నగరం! నా కిక్కడ చెవుడు వచ్చేస్తున్నది. వాళ్ళ యుద్ధ దుందుభుల ధ్వనులు విని ఎంతో కాలమయింది," అన్నాడు.

"ఎగువ అరణ్యం మాత్రమే ఉన్నది. నేను ఎరిగిన ఏనుగులు హాథీ, అతని కొడుకూ మాత్రమే. ఒక గ్రామంలో ఉన్న గుర్రాలన్నిటినీ బాఘీర చంపేశాడు. పోతే—రాజు అంటే ఏమిటి?" అన్నాడు మౌగ్లీ.

"నీ నగరం ఇప్పుడు లేదని నీతో నాలుగు నెలల క్రితమే చెబితిని కాదుటోయ్?" అన్నాడు కావా తెల్లపడగతో.

"అరణ్యం మధ్య, రాజుగారి పహరా బురుజులు గల ద్వారాలతో కూడిన నగరం ఎలా పోతుంది? నా తండ్రికి తండ్రి గుడ్డు నుంచి బయటికి రాకపూర్వం కట్టిన నగరం అది. నా కొడుకుల కొడుకులు నాలాగా పాలి

తెల్లగా కదులుతూ ఉండటం మౌగ్లీకి కన బడింది. కొంచెం కొంచెమే లేస్తూ ఒక తాచుపాము అతని కళ్ళ ఎదట నిలబడింది. మౌగ్లీ తన జీవితంలో అంతపెద్ద తాచును ఎన్నడూ చూడలేదు. ఆ సర్పం నిడివి దాదాపు ఎనిమిది అడుగులుంటుంది. చీకటిలోనే ఉండటంచేత అతను పాలిపోయి పాత దంతం రంగుగా తయారయాడు. విప్పిన అతని పడగమీది కృష్ణపాదాలు కూడా మాసిపోయిన పసుపు పచ్చరంగు తిరిగాయి. అతని కళ్ళు కెంపుల్లాగా మెరుస్తున్నాయి. చూడటానికి అతను చక్కగా దివ్యంగా ఉన్నాడు.





పోయేదాకా అది నిలిచి ఉంటుంది. యాగ సూరి కొడుకు విజయుడు; అతని కొడుకు చంద్రబీజుడు; అతని కొడుకు సలోంథీ బప్పారావల్ హయాంలో దాన్ని నిర్మించాడు. మి రెవరి పశువులు?" అన్నాడు తెల్లపడగ.

మౌగ్లీ కావా కేసి తిరిగి, "అయోమయంలో పడ్డాను. అతడి మాట ఒక్కటీ నా కర్థం కావటంలేదు," అన్నాడు.

"నాకూ అలాగే ఉంది. అతను మహా వృద్ధు," అని కావా మౌగ్లీతో అని, తెల్లపడగతో, "నాగపితామహా, ఈ ప్రాంతంలో అనాదిగా అరణ్యమే ఉంటున్నది," అని చెప్పాడు.

"అలా అయితే, నా కెదురుగా కూర్చున్న ఇతగా డెవడు? ఇతడికి రాజుగారి పేరు తెలీదు. భయం ఎరగడు. మనిషి నోటితో సర్ప భాష మాట్లాడతాడు. పామునాలుక తోబాటు కత్తి కూడా ధరించాడు. ఎవరితడు?" అన్నాడు తెల్లపడగ.

ఆ ప్రశ్నకు మౌగ్లీ జవాబు చెబుతూ, "నన్ను మౌగ్లీ అంటారు. నేను అరణ్యవాసిని. తోడేళ్ళు నావాళ్ళు. ఈ కావా నాకు అన్న. నాగపితామహా, నువ్వెవరు?" అని అడిగాడు.



"నేను రాజనిక్షేప రక్షకుణ్ణి. నా చర్మం నల్లగా ఉన్న కాలంలోనే కరుణరాజా ఈపైన ఉన్న కప్పుకట్టాడు! దొంగతనానికి వచ్చే వారికి చావు చవిచూపమని నా కోసం ఈ ఏర్పాటు చేశాడాయన. తరవాత రాతి ద్వారం కుండా నిధిని లోపలికి దించారు. బ్రాహ్మణులు గాసం చేశారు," అన్నాడు తెల్లపడగ.

మౌగ్లీ స్వగతం, "ఓహో, ఇందులో ఏదో చెరుపు ఉన్నది. తెల్లపడగ చెప్పేది సామాన్య విషయంకాదు. మనిషి మంద వెంట ఉన్నప్పుడు ఒక బ్రాహ్మడి సంగతి తెలుసుకున్నాను," అనుకున్నాడు.



తెల్లపడగ చెప్పుకు పోతున్నాడు:

"నే నిక్కడికి పచ్చాక అయిదు సార్లు రాతి పలక ఎత్తి, మరింత నిధి దించారు. ఇంత గొప్ప నిధి మరెక్కడా లేదు—నూరు రాజుల నిధి. అయితే ఆఖరుసారి పలక ఎత్తి చాలా, చాలా కాలమయింది. నా నగరం నన్ను మరిచిపోయిందో ఏమో మరి."

"అసలు నగరమే లేదు. పైకి చూడు. ఆ కనిపించేవి, రాళ్ళను చీల్చుకుని దిగుతున్న మహావృక్షాల వేళ్ళు. చెట్లూ, మనుషులూ కలిసి పెరగరు," అన్నాడు కావా.

తెల్లపడగ కసిగా, "రెండు, మూడు సార్లు మనుషు లిక్కడ ప్రవేశించారు. నేను చీకట్లో పాకి వాళ్ళను చేరవచ్చేసరికి వాళ్ళేమీ మాట్లాడలేదు. ఆ తరవాత వాళ్ళు బహు కొద్దిసేపు మాత్రమే పలవలలాడారు. మీరేమో వచ్చి నాతో నానా అబద్ధాలూ ఆడుతున్నారు—ఒక మనిషి ఒక సర్పమూనూ. నగరమే లేదనీ, నా రక్షణపని ముగిసిందనీ నన్ను నమ్మమంటారు! రాతి పలక ఎత్తి, బ్రాహ్మలు గానం చేస్తూ దిగి వచ్చి, నాకు వెచ్చని పాలు పోసి, వెలుగులోకి తీసుకు పోయేదాకా నేను రాజనిక్షేప రక్షకుణ్ణే! నగరం చచ్చిపోయిందా? అవి చెట్లవేళ్ళా? అయితే వంగి ఈ రత్నాలను తీసుకోండి చూస్తాం. ప్రపంచంలో ఇంత విలువైనవి మరి లేవు. పామునాలుక మనిషీ, నువు వచ్చినదారినే ప్రాణాలతో తిరిగి పోగలిగితే చిన్న చిన్న రాజులందరూ నీకు బానిసలైపోగలరు!" అన్నాడు తెల్లపడగ.

"మళ్ళీ దారి తప్పుతున్నది. నాగపితా మహా, తీసుకు పోవటానికి ఇక్కడ ఏమీ కనబడదే?" అన్నాడు మౌగ్లీ.

"సూర్య చంద్రుల సాక్షిగా, ముక్కోటి దేవతల సాక్షిగా ఈ అబ్బాయికి చావు పిచ్చి పట్టుకున్నది. నువు కళ్ళు మూసేలోపుగా నీకు ఏ మానవుడూ చూడనిది చూపిస్తాను, చూడు," అన్నాడు తెల్లపడగ.



# 77. ఆంగర్స్ దుర్గం

దీనిని అంగర్స్ (ఫ్రాన్సు) వద్ద 9 వ లూయీ నిర్మించాడు. ఈయనను సంత్ లూయీ అంటారు (13 వ శతాబ్ది). ఈ దుర్గానికి 17 బురుజు లున్నాయి. మబ్బుల వంటే ఈ దుర్గాన్ని మూడవ హెన్రీ నిర్మూలించమని ఉత్తరువిచ్చాడు. కాని అంగర్స్‌లోని గవర్నరు తాత్సారం చేసి దాన్ని కాపాడగలిగాడు.



Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

తలకట్టు

పంపినవారు,
బి. జనార్ధన్, ఎలమంచిలి

Photo by prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

గుడిదీర్ఘం

పంపినవారు,
బి. జనార్ధన్, ఎలమంచిలి

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 జూన్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: తలకట్టు

రెండవ ఫోటో: గుడిదీర్ఘం

పంపినవారు: బి. జనార్దన్,

తాలూకా ఆఫీసు, ఎలమంచిలి. (విశాఖ జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# తలనొప్పి

ఎక్కువగా ఉన్నా

# తలకేగా!

# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పిఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.




అమృతాంజన్ <u>నొప్పులు జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT-AM-1610

# ఇప్పుడే...

# మీ సహాయం అవసరం!

"మన మందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్, ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన ఆపద యావద్భారతదేశానికే వచ్చిన ఆపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కొనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషి చేయాలి."

**ఇందిరా గాంధి**

ప్రధాన మంత్రి

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధికి
ఉదారంగా విరాళ మివ్వండి.

విరాళాలను నగదు రూపంలో కానీ, వస్తు రూపంలో కానీ
ఈ క్రింది చిరునామాకు పంపండి.

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధి,
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ - 4.


నిరాలా
నా రహస్యం
పరిశుభ్రంగా
ఉతకడానికి
ASP TIL N 28 TEL
nirala
నిరాలా బార్ సబ్బు ఆదాయకరమైనది. గుడ్డలన్నింటిని స్వచ్ఛంగా, పరిశుభ్రంగా తెల్లగా వుంచగలిగినట్టిది. నిరాలాలో ఆశ్చర్యకరమైన శక్తి వుంది. మీ గుడ్డలను చక్కగా ఉతుకుతునే వాటిని రక్షించగలదు.
నేడే నిరాలా చూడండి అది నమ్మకమైన పేరు.
తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.

# ఐకమత్యమే మహా బలం

రిపబ్లిక్ దినోత్సవము పూర్తయింది.
ఉత్సవాలను మననం చేసుకుంటున్న మనం.
ఐకమత్యము ద్వారానే కాంతియుతమైన సౌభాగ్యాన్ని
పొందగలమని గుర్తుంచుకోవాలి. మన దేశంపై నమ్మకాన్ని,
గౌరవాన్ని దృఢపరచుకున్న మనం, ముందున్న
ఉత్కృష్ట కార్యానికి మనల్ని మనం మరలా అంకితం
చేసుకుందాము.

ఒక మహా దేశము, ఒక మహా ప్రజ



